# మరపురాని మనీషి

మనీషి వతంసుల లేఖినీచిత్రాలు

## తిరుమల రామచంద్ర




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# MARAPURAANI MANEESHI

By Tirumala Ramachandra

A Collection of Essays
introducing eminent personalities

© YUVABHARATHI, SECUNDERABAD-500 003

యువభారతి

ప్రచురణ : 34.

ప్రథమ ముద్రణ : ప్రతులు 5,200

2 ఫిబ్రవరి, 1975

చిత్రాలంకరణ :
బి.వి. సత్యమూర్తి

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003.

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.

వెల : రూ. 8-00

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL




# మా మాట

"ఎందరో మహానుభావులు-అందరికీ వందనములు."

విలక్షణమైన తమ వ్యక్తిత్వంతో ప్రతిభావ్యుత్పత్తులతో తాము అధిష్ఠించిన వేదికకు అపూర్వశోభను ప్రాముఖ్యాన్ని సంతరించిపెట్టిన మనీషివతంసుల జీవితవిశేషాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయంలేకపోతే నూత్నప్రయోగాలు చేయడానికి ఉద్యమించే వారికి లక్ష్యశుద్ధి ఏర్పడదు. సజీవమైన జాతి తన ఉనికికి తోడ్పడుతున్న మహితాత్ములను సమాదరిస్తుంది, సంస్మరించుకొంటుంది. నిర్మాణైక దృక్పథంతో ముందుకుసాగే జాతికిది అవసరం.

దేశాన్ని జాగరితం చేసిన మహాపురుషులు వివిధరంగాలలో సాధించిన సిద్ధులను గూర్చి కొంతైనా సరళమైన భాషలో క్లుప్తంగా వారి వ్యక్తిగతాభిరుచులు అభిప్రాయాలను గూర్చి చమత్కారంగా తెలిపే గ్రంథాలు తక్కువనే చెప్పాలి.

1962లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో శ్రీ తిరుమల రామచంద్రగారు 'మరపురాని మనీషి' అనే శీర్షికతో 29 మంది మహామనీషుల గూర్చి పరిచయాత్మక వ్యాసాలను ప్రచురించారు. అవి యావదాంధ్రదేశంలోని అక్షరాస్యులను, పండితులను, రసికులను భాషాభిమానులను ఆనందోత్సాహ కల్లోలినిలో తలమునకలు వేయించినవి. వానికి తోడుగా ఇప్పుడు మరో ముగ్గురు ప్రజ్ఞామూర్తులను పరిచయంచేసే వ్యాసాలతో ఈ సంపుటి వెలువడుతున్నది. శ్రీ రామచంద్రగారు సంస్కృత ఆంధ్ర, కన్నడ, తమిళ, హిందీ, ప్రాకృత, ఆంగ్లభాషలలో చక్కని అభినివేశాన్ని సంపాదించుకున్న పండితులు. ప్రసిద్ధ పాత్రికేయులు, స్వాతంత్ర్యసమరయోధులు, నిరాడంబరులు, ప్రాతః స్మరణీయులైన కీ॥ శే॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శిష్యులు. "మనలిపి-పుట్టుపూర్వోత్తరాలు", "నుడి-నానుడి" వంటి పరిశీలన గ్రంథాలను ప్రచురించి అపూర్వాంశాలను వెలువరించిన గౌరవానికి పాత్రులైనారు.

"మరపురాని మనీషి"ని ప్రచురించే అవకాశాన్ని యువభారతికి ప్రసాదించిన శ్రీ తిరుమల రామచంద్రగారి భాషోద్యమానికి, మా ఆదరాభిమాన పురస్సరములైన అభివందన పరంపరలు. ముఖచిత్రాన్ని, మనీషుల రేఖాచిత్రాలను జీవకళలుట్టిపడేట్టుగా చిత్రించి యిచ్చిన శ్రీ బి. వి. సత్యమూర్తిగారిని యువభారతి మరువలేదు-

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడంలోను యథోచితంగా తోడ్పడి తమ ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

2-2-1975

అధ్యక్షుడు



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 35 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల ఇరవై ఐదు వేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో లోగడ దాదాపు ఎనిమిది వేలమంది సభ్యులుగా ఉండేవారు. గత డిశంబర్ 1 నుండి కొత్తరూపు దిద్దుకున్న ఈ ప్రణాళికలో ఇప్పటికి రెండువేలమందికి పైగా సాహితీమిత్రులుగా చేరారు. పాత సాహితీ మిత్రులు కూడా ఈ పథకంలో చేరి, రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందలకు పైగా భారతీమిత్రులుగా, యాభైమంది భారతీభూషణులుగా చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని కోరుతూ—

ఇరివెంటి కృష్ణమూర్తి

2-2-1975

అధ్యక్షుడు

# ప్రస్తావన

కథ చెప్పటం ఎంతకళో కథానాయకుణ్ణి చిత్రించటం అంతకళ. చరిత్రనే కథగా చెప్పాలంటే కత్తిమీద సాముచేసే ప్రజ్ఞ కావాలి. ఆ చరిత్రరంగంలో నాయకత్వం నిర్వహించే మనీషిని మనోజ్ఞంగా చిత్రించాలంటే వాఙ్మయమైన చిత్రకళ కావాలి. వాస్తవాన్ని కళారేఖలతో వస్తుతత్వాన్ని తెల్పే వంపులతో గీసి జీవచైతన్యాన్ని వ్యంజింపచేసే భంగిమతో రూపొందించే విశిష్టప్రక్రియ ఈ కళ. ఇది ఉత్త పరిచయం కాదు; గట్టి పరిశోధనం కాదు. పరిచయం చెప్పే వివరాలూ, పరిశోధన చేసే విశ్లేషణాలూ కావు ఇందులో ప్రధానం. ఫొటోగ్రఫీలాగా ఛాయనుమాత్రం చూపించటం కాదు; ఎక్స్‌రే లాగా అస్తిపంజరాన్ని ఆలోకింపచేయటం కాదు. చేవగల జీవచైతన్యం జీవితక్షేత్రంలో సాగించిన కృషినీ, సాధించిన ఫలసాయాన్నీ సమాజసముత్తేజానికి సమర్పణం చేసిన సౌజన్య శీలాన్ని చిత్రించే విచిత్ర ప్రక్రియ ఇది.

మనీషుల మహనీయ సిద్ధులే మానవజాతి మహాప్రస్థానంలో మైలురాళ్లు. మనీషికి మొదటి లక్షణం మానవత్వం. అది ఆయన మానసకాసారంలో వికసించే మనోజ్ఞ కమలం. ఆయనకు రెండవ లక్షణం మేధావిత్వం. అది ఆయన బుద్ధిక్షేత్రంలో సిద్ధించే జ్ఞానఫలం. మనోబుద్ధుల అనురూప సమావేశమే మనీషుల అమరత్వం. మనిషిగా బ్రతికే మనీషినే మానవత పూజిస్తుంది; కలకాలం స్మరిస్తుంది. మనీషుల చిత్రణంలో వారి మహిమ కెంత ప్రాధాన్య ముంటుందో వారి మనసుకు అంత ప్రాముఖ్య ముంటుంది. ఒకటి పైవెలుగు- మరొకటి లోవెలుగు.

మనీషుల వ్యక్తిత్వాలను చిత్రించే సారస్వత ప్రక్రియ ప్రతి సభ్యభాషలోనూ ఉంటుంది. అది వీరారాధనంలో ఒక భాగంగా, సంస్కృతి కొక చిహ్నంగా భావిస్తారు చరిత్రకారులు. వీరులు కదనరంగంలోనే కాదు, కళారంగంలోనూ, సమాజ సేవా రంగాల్లోనూ ఉంటారు కదనరంగంలో కనపడే కండబలిమికంటే దాని వెనుక ఉన్న త్యాగవీరానికి గౌరవం ఎక్కువ. కళారంగంలో ప్రక్రియా సాధనం కంటె ప్రయోజనానికి ప్రతిపత్తి ఎక్కువ. సమాజ సేవారంగంలో స్వార్థంకంటె పరార్థానికి పరిగణనం ఎక్కువ. వీరి కీర్తనం ఛాందసమైన సంప్రదాయం కాదు; అభ్యుదయాని కబ్బే అభినవ తేజం!

వీర కీర్తనం, మనీషి ప్రభావం కవితలో వెలిస్తే కావ్యమౌతుంది; కథగా వెలిస్తే గాథగా, జీవిత చరిత్రగా రూపొందుతుంది. కానీ, ఈ రెండూ విస్తృత ప్రక్రియలు. ఆధునిక యుగంలో మహాకావ్యాలకంటె ఖండకావ్యాలకూ, భావగీతికలకూ ప్రచారం ఎక్కువగా ఉంది. వేగవంతమైన ఆధునిక జీవితంలో అల్పాక్షరాలలో అనల్పప్రభావం వేసే సంగ్రహ రచనలు కావాలి. స్కెచ్, ప్రొఫైల్ లాంటి ప్రక్రియలు మనీషుల చిత్రణానికి అనువైనవిగా ఆధునికులు గుర్తించారు. ఈ రెండు ప్రక్రియలూ ప్రధానంగా

చిత్రకళకు సంబంధించినవి. తరువాత రచనాప్రక్రియలకు అన్వయింపబడినవి. స్కెచ్ అనే పదానికి Unfinished drawing or painting అనీ, general account of some thing అనీ, a fragment of narrative or discription అనీ అర్థాలు నిఘంటువులు చెపుతున్నాయి. దీన్నే రేఖాచిత్ర మంటాం తెలుగులో. వెలుగు నీడల వివరాలతో వర్ణరంజితమైన నిలువుపాటి చిత్రం కాదది. శక్తిమంతమైన కొన్ని రేఖలతో వ్యక్తి వైఖరి గోచరించేటట్లు గీచిన భావచిత్రం. వ్యక్తియొక్క జీవచైతన్యం రేఖలమధ్య తొంగిచూస్తుండటం దీని ప్రత్యేకత. వ్యంగ్యచిత్రంకంటె భావచిత్రం వేరైంది. వ్యంగ్యచిత్రంలో హావంతోపాటు హాస్యం మేళవింపబడుతుంది. భావచిత్రంలో హావంలో భావం నిండిఉంటుంది. దానిలో ప్రతీకాత్మకమైన కల్పన ఉండవచ్చు; దీనిలో ప్రతిబింబాత్మకమైన భావవ్యక్తి ఉంటుంది. ఈ లక్షణాలనే సారస్వతంలో రేఖాచిత్రాలకు అన్వయించాలి. కథనంలో, వర్ణనంలో, చిత్రణంలో మనీషియొక్క రూపురేఖలతోపాటు, భావవ్యక్తి రూపుకట్టటం రేఖాచిత్రానికి ప్రధానలక్షణం.

స్కెచ్‌కీ ప్రొఫైల్‌కీ కొంత తేడా ఉంది. ప్రొఫైల్ పదానికి- Outline of the face as seen from the side అనీ, any edge outlined against the sky or other background అనీ నిఘంటువులు అర్థం చెపుతున్నాయి. దీన్ని సారస్వత ప్రక్రియకు అన్వయించుకోవాలి. ఒక దృక్కోణంతో ఒక వ్యక్తి ప్రధాన వ్యక్తిత్వాన్ని సమకాలీన వాతావరణానికి అన్వయించి సమీక్షించటం ప్రొఫైల్‌కు ప్రధానలక్షణ మౌతుంది. చిత్రంలో ముఖాన్ని ఒక కోణం నుంచి దర్శించిన విధంగా రూపొందించటమంటే అర్థ మిదే. ముఖం వ్యక్తియొక్క వ్యక్తిత్వానికి ప్రతీక. దాన్ని రేఖామధురంగా ఆవిష్కరించటం కళాధర్మం. ఆ రేఖామాధుర్యంలో జీవచైతన్యం తొణికిసలాడాలి; ఒక విశిష్ట దర్శనం రూపుకట్టాలి. చిత్రకళలో రేఖలు చేసేపని ఈ ప్రక్రియలో కథన-లేక-వర్ణన శిల్పం చేస్తుంది. ఈ ప్రొఫైల్‌ను పదచిత్ర మని కొందరన్నారు. లేఖినీచిత్ర మని తిరుమల రామచంద్ర గారన్నారు. భావచిత్ర రచయిత వ్యక్తియొక్క స్వరూప స్వభావ వర్ణనాన్ని రేఖామాత్రంగా భావసుందరంగా ఆవిష్కరించటానికి ప్రయత్నిస్తాడు. పదచిత్ర రచయిత సమకాలీన పరిస్థితులమధ్య ఒక వ్యక్తి ఎలా తన వ్యక్తిత్వాన్ని నిర్మించుకున్నాడో తన దృక్కోణంతో సమీక్షించి సమన్వయంతో చిత్రిస్తాడు. స్కెచ్‌లో రచయిత నిర్లిప్తుడై వ్యక్తియొక్క నిజరూపాన్ని నిరూపించటానికి ప్రయత్నిస్తాడు; ప్రొఫైల్‌లో తాను చూసిన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించటానికి ప్రయత్నిస్తాడు.

'స్కెచ్'కంటె 'ప్రొఫైల్' చిత్రణం కత్తిమీద సామువంటిది. రచయిత చిత్రించే మనీషి వ్యక్తిత్వం సర్వజనాంగీకారమైన సమన్వయ మార్గంలో సాగాలి. సాగాలని నియమం లేదంటారు కొందరు. అదీ కొంతవరకు నిజమే. అయితే 'ప్రొఫైల్' చిత్రణంలో రచయిత రాగద్వేషాలు ప్రధానంగా ప్రతిబింబిస్తే దానికి విశ్వజనీనత కొరవడుతుంది. విభిన్న దృక్కోణాలతో వ్యక్తిత్వాన్ని సమన్వయించటమే ఈ ప్రక్రియలో

ప్రధాన లక్షణమైతే విశ్వజనీనత కొరవడితే దోషం కాదంటారు కొందరు. కాని, రచయిత దర్శనం, సమన్వయం సహేతుకంగా, సహృదయ భావబంధురంగా ఉన్నప్పుడు పఠితను ఆ రచయిత ఒక్కొక్కసారి తన దృక్పథంతో ప్రభావితం చేయవచ్చు. అయినా, ఇందులో గమనింపదగిన అంశం ఒక్కటే. రచయిత మనీషిమీద మహాభిమానం ప్రకటించినా, తీవ్రద్వేషాన్ని వెళ్లగక్కినా పఠితల సానుభూతిని కోల్పోతాడు. ఒకని ముఖం ఒక పోజులో బాగుంటుందనుకోండి; ఫొటోగ్రాఫరు ఆ కోణంలోనుంచి ఆ ముఖాన్ని రమణీయంగా చిత్రబద్ధం చేస్తాడు. ఒక మనీషి ఒక క్షేత్రంలో మహోజ్జ్వలంగా భాసిస్తాడనుకోండి. ఆయన్ను చూచే దృక్కోణంతో చూచి ఆయన వ్యక్తిత్వాన్ని చిత్రించాలి. సవ్యమైన దృక్కోణంలోంచి చూడటమే ఈ ప్రక్రియిలో ఉన్న ఔచిత్యం. ఆ ఔచిత్య పాలనం ఎంత సమర్థనీయంగా సాగితే రచయిత చిత్రణం అంత విశ్వజనీన మౌతుంది. శ్రీ తిరుమల రామచంద్రగారు 'ప్రొఫైల్' చిత్రణంలో సిద్ధహస్తులు వారి చిత్రణం విశ్వజనీనమైన కళాధర్మాలతో వెల్లివిరిసింది. ఒక్క ఉదాహరణం చూడండి- కృష్ణశాస్త్రిగారిని 'మరపురాని మనీషిగా' చిత్రిస్తూ-

"వారు వ్రాసింది ఎంత ! అన్నది బాలిశుల ప్రశ్న. 'అమరుకకవేః ఏకః శ్లోకః ప్రబంధ శాతాయతే' అన్నాడు ఒక సహృదయుడు. అది నాడూ, నేడూ నిజం. దేవులపల్లి వారి 'ఏకం పద్యం ప్రబంధ శతాయతే' అంటాను నేను. ఇది నేడూ రేపూ నిజం. సాహిత్య చరిత్రకారులు ఏమి వ్రాతలు వ్రాసినా, నేను మాత్రం దేవులపల్లివారిని నవ్యకవితా ప్రస్థానాచార్యులుగా పురస్కరిస్తాను"—

'నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?-నా యిచ్ఛయేగాక నాకేటి వెరపు ?'-అని ముగించారు. కృష్ణశాస్త్రిగారి కవిత్వంమీద భిన్నాభిప్రాయాలు ఉండవచ్చు. తాను నమ్మిన సత్యాన్నే, తాను చూచిన దృక్కోణాన్నే రచనలో ప్రదర్శించాడు రచయిత. అది సార్వకాలిక సత్యమని సహేతుకంగా సమర్థించాడు. కృష్ణశాస్త్రి మాటలే తన మాటలుగా ముగించాడు తాదాత్మ్యంతో. ఈ విధమైన చిత్రణం కవిమీద ఎంత గౌరవం కల్పిస్తుందో రచయిత మీదకూడా పఠితకు అంత విశ్వాసాన్ని కల్పిస్తుంది పఠితల విశ్వాసాన్ని చూరగొనటం కంటె ఈ ప్రక్రియకు సార్థక్యమేముంది !

ఈ విధమైన సారస్వత ప్రక్రియకు పాశ్చాత్యుల్లో Izaak Walton లాంటి ప్రముఖులు రూపురేఖల్ని తీర్చిదిద్దారు. భారతీయుల్లో యం. చలపతిరావు లాంటి ప్రముఖ పాత్రికేయులు దాన్ని చేపట్టి పత్రికా రచనలో ఒక శాఖగా దాన్ని రూపొందించారు. తెలుగులో ఈ రంగంలో కృషిచేసిన పెద్దలూ, వెలువడిన రచనలూ కొన్ని ఉన్నాయి. అన్నింటినీ ఇక్కడ పేర్కొనటానికి నాకు శక్తి లేదు, అవకాశమూ లేదు. 'విశాలాంధ్రము' (అవటపల్లి నారాయణరావుగారు), ధన్యజీవులు (ఆచార్య రంగాగారు), పెద్దలు పరమపదించినప్పుడు నార్లవారు వ్రాసిన సంపాదకీయాలూ, 'జాతివెలుగులు' (గొట్టిపాటి బ్రహ్మయ్యగారు), 'మహానాయకులు', 'జాతినిర్మాతలు' (తుర్లపాటి కుటుంబరావుగారు), 'ఆణిముత్యాలు' (వేమూరి రాధాకృష్ణమూర్తిగారు), 'మన పండితులు కవులు

రచయితలు' (కోవెల సంపత్కుమారాచార్యగారు), 'చరిత్రకందని మృతవీరులు' (ఎ. పండరీనాథ్‌గారు), 'ఆంధ్ర నాటకకర్తలు' (వివిధ రచయితలు), 'మరుగుపడ్డ మాణిక్యాలు' (ఆచార్య బి. రామరాజుగారు), 'నవ్యాంధ్ర నిర్మాతలు'—మొదలైనవి ఎన్నో. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి విశిష్ట సభ్యుల ప్రశంసలు (ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి రచన) కూడా ఈ వరుసలో పేర్కొనదగిందే. ఇంక తెలుగు వార పత్రికలు, మాసపత్రికలూ ధారావాహితంగా మహాపురుషుల్ని పరిచయంచేసిన శీర్షికలను ప్రత్యేకంగా పేర్కొనాలి. 'తెలుగువెలుగులు' (ఆంధ్ర సచిత్రవారపత్రిక) ఆరుద్రగారి రచన; 'మరపురాని మనీషి' (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక) తిరుమల రామచంద్ర గారి రచన; 'నటరత్నాలు' నటులను గురించి శ్రీ మిక్కిలినేని గారి రచన (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక); 'సరిగమపా' సంగీత విద్వాంసులను గురించి నండూరి పార్థసారథి గారి రచన (ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక); చైతన్యమూర్తులు (వివిధ రచయితలు-ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక) - మొదలైనవి. ఇందులో అన్నీ పదచిత్రాలే కాదు; కొన్ని రేఖాచిత్రాలుకూడా ఉన్నాయి. పదచిత్ర ప్రక్రియలో ప్రసిద్ధిగాంచిన - 'మరపురాని మనీషి' శీర్షిక క్రింద వచ్చిన లేఖినీచిత్రాలను యువభారతి ఒక సంపుటంగా ప్రచురించటం ఎంతో ముదావహం. సమకాలీన సాహితీప్రియుల కీ గ్రంథం చక్కని ఆల్బంలా ఉపయోగిస్తుంది. పత్రికలో ప్రచురించిన ఫొటోలకు బదులు ప్రొఫైల్ స్వరూపాన్ని అందించే రేఖాచిత్రాలను పొందుపరచటం ఇందులోని విశేషం, ఔచిత్యం.

శ్రీ తిరుమల రామచంద్రగారు ప్రసిద్ధ విద్వాంసులు, ప్రాత్రికేయులు, సంస్కృతాంధ్రాంగ్లాలలో వారికి గట్టి అభినివేశంతో కూడిన పాండిత్యం ఉంది. లిపి పుట్టు పూర్వోత్తరాలనుండి హైదరాబాదు లేఖ వరకూ వారి రచనలు తెలుగువారికి తీయందనాలు పంచిపెట్టిన తేనెపట్టులు. రచయితగా, విశేషించి మనసున్న మనిషిగా ఎందరి మనీషుల చేతనో మన్నన లందుకొన్న మానిసి ఆయన. తెలుగువారికి 'మరపురాని మనీషి' శ్రీ తిరుమల రామచంద్ర. జాతిరత్నాల్లాంటి పదచిత్రాలను మనముందు ఉంచారు వారు. వైవిధ్యంతో కూడుకున్న వ్యక్తుల్ని ఎన్నుకోవటంలోనూ, ఎన్నుకొన్న వ్యక్తుల్లోని ఎన్నికైన గుణాలను మన్నికైన రచనంలో చిత్రించటంలోనూ వారు కృతకృత్యులయ్యారు. ఇందులో ప్రసిద్ధులైన కవులు, గాయకులు, రచయితలూ, రచయిత్రులూ, పండితులూ, పరిశోధకులూ, ప్రాత్రికేయులూ, నటకులూ, ఆచార్యులూ, దేశభక్తులూ, కార్యకర్తలూ చిత్రింపబడ్డారు. రాజకీయ నాయకుల్ని ఈ వరుసలో చేర్చక పోవటంచేత ఇది సాహిత్యకళా రంగాలకే పరిమితమైన లేఖినీచిత్రాలని పేర్కొనవచ్చు. ప్రజలలో సాహిత్య చైతన్యాన్ని వ్యాపింపచేయటంలో యథాశక్తి కృషిచేస్తున్న మా యువభారతి ఈ గ్రంథాన్ని ప్రచురింపగలగటం అదృష్టవిశేషం. యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకుడుగా రెండుమాటలు ముందుగా వ్రాసే అవకాశం దొరికినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను.

2-2-1975

జి.వి. సుబ్రహ్మణ్యం

# మనవి మాటలు

దశాబ్దం క్రిందట రాజకీయేతర రంగాలలో ప్రముఖులైనవారి సేవను పాఠకులకు పరిచయం చేయాలని ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక సంకల్పించినప్పుడు, నేనూ, నా సహ పత్రికా రచయిత శ్రీ నీలంరాజు మురళీధరూ ఆ యా ప్రాంతాలకు వెళ్లి ప్రముఖులను కలుసుకొని, సేకరించిన విషయాలతో, శ్రీ మురళీధర్ తీసిన ఛాయాచిత్రాలతో పాటు 'మరపురాని మనీషి' శీర్షిక క్రింద ధారావాహికంగా ప్రచురించిన లేఖినీచిత్రాలలో కొన్ని ఇవి.

ఆ యాత్రలో నేను కలుసుకొన్నవారి జీవితచరిత్రలు చిత్రించదగినంత విషయ భండారం సేకరించినాను. వారితో అరమరికలు లేక చర్చలు జరిపినాను. చిన్ననాటి సంగతులు తెలుపుతున్నప్పుడు వారికి కలిగిన భావావేశాలు, స్పర్థలు, ఎదుర్కొన్న సమస్యలు, వాటి పరిష్కారానికి చేసిన ప్రయత్నాలు మొదలైనవి కుప్పలు తెప్పలుగా దొర్లిన ఆ చర్చలు కొందరి కొందరి సహజ సరళప్రకృతిని, ముందుతరాలవారికి ఏమీ ఇవ్వలేకపోయామే ననే ఆవేదనాక్రోశాలను కుమ్మరించి, వారి పెద్దతనాన్ని పిరమిడ్లుగా పేర్చగా, నా చిన్నతనం నాకు అనుపదం కనిపిస్తూ, అలాటి వారిముందు నా స్థాన మేమిటో హెచ్చరించి చెప్పినట్టు అనిపించేది. ఆ విషయభండారం నుంచి నాకు కావలసినవి, నేను చెప్పగలిగినవి మాత్రమే గ్రహించి, వారి సేవాస్వరూపం చిత్రించినాను. ఈ చిత్రాలు పఠితలకు దిక్సూచకాలు మాత్రమే; ఈ దారిని వెళ్లితే పఠితలు ఎన్నో సంగతులు తెలుసుకోవచ్చు నని నా నమ్మకం.

నేను వ్రాయవలసిన లేఖినీ చిత్రాలు కొన్ని కారణాలవల్ల అప్పుడు ఆగిపోయాయి. వాటిలో మూడింటిని-శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, నిడదవోలు వెంకటరావు, మోటూరి సత్యనారాయణ గార్లను- దీనిలో చేర్చినాను.

నేను కలుసుకొన్నవారిలో పలువురు గత దశాబ్దంలో ఎన్నో అభ్యుదయాలు పొందినారు; కొత్తరచనలూ చేసినారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ జ్ఞానపీఠ బహుమతి పొందినారు. శ్రీ జాషువా 'పద్మభూషణ' బిరుదు పొందినారు. కొందరు కీర్తిశేషులయినారు. ఆ సంగతులు గుదిగుచ్చడం అందదుకులుగా కనిపిస్తుందని మానుకొన్నాను వాటిని తెలుసుకోవలసిన బాధ్యతను పఠితలకు అప్పగించినందుకు క్షంతవ్యుణ్ణి.

నా కోసం తమ అమూల్య కాలాన్ని వినియోగించి, నా పిచ్చిప్రశ్నలకు ఓపికతో సమాధానం చెబుతూ, తమ జీవితాన్ని ఆవిష్కరించిన ఆ మనీషుల కందరికీ కృతజ్ఞుణ్ణి.

దశాబ్దం తర్వాత ఇవి పుస్తకరూపంలో ఆంధ్రావళికి అందడం- పుస్తకముద్రణ ప్రచురణలు ప్రళయతాండవమైన ఈ సమయంలో అందడం- నాకు ఆశ్చర్యానందాలు కలిగిస్తున్నది. యువభారతి నిర్వాహకులు మిత్రులు శ్రీయుతులు వంగపల్లి విశ్వనాథం, ఇరివెంటి కృష్ణమూర్తి, డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం మొదలైనవారు పూనుకొనక పోయివుంటే, ఇవి ఇంత సుందరరూపంలో వచ్చేవి కావు. వారికి నా ధన్యవాదాలు.

అప్పటి ఛాయాచిత్రాలతోపాటు ప్రచురించాలని నా మనస్సులో ఉండేది. కాని రేఖాచిత్రాలు సరికొత్త అందాన్ని తెస్తాయనిపించింది. వకాలత్‌ను వదలి వర్ణప్రపంచంలో దూకిన మిత్రులు శ్రీ బి. వి. సత్యమూర్తి ఎంత చక్కగానో రేఖాచిత్రాలు గీచి, పుస్తకసౌందర్యాన్ని పెంచడం మాత్రమే కాక, తమ రేఖా రామణీయక సౌష్ఠవాలతో మనీషులను నిజంగా మరపురాకుండా చేసినారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఈ లేఖినీ చిత్రాలను పుస్తకరూపంలో ప్రచురించడానికి సహృదయతతో అనుమతించిన ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక యజమానులు శ్రీ భగవాన్‌దాస్‌జీ గోయంకాకు, అప్పటి సంపాదకులు, మిత్రులు శ్రీ బి.సి. కామరాజుకు నేనెంతో ఋణపడివున్నాను.

ఈ 'మరపురాని మనీషి'ని నా బాల్యమిత్రుడు, సతీర్థ్యుడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రికి అంకిత మిస్తున్నందుకు చాల ఆనందిస్తున్నాను. ఇతడుకూడ మరపురాని మనీషి. దీనిని స్వీకరిస్తున్న నా మిత్రునికి చాల కృతజ్ఞుణ్ణి.

ఆనంద సంక్రాంతి
14-1-1975
69, ఆదర్శనగర్, హైదరాబాద్.

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# అంకితం

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రికి



మిత్రుడా ! నీ వాక సాహిత్య రత్నాకరం. నీ సంభాషణ చాతుర్యం సుభాషిత రత్నభాండాగారం. నీ భాషణ పాటవం సప్తగోదావరం; ఆంధ్రీ గైర్వాణీ కర్నాటీ ద్రావిడీ మహారాష్ట్రీ హిందీ ఉరుదూలలో నీ వక్తృత్వం హరిద్వార గంగవలె, గద్గద నదద్గోదావరి వలె, సముత్తుంగ వీచీఘటా గంభీర తుంగభద్రవలె సాగిపోతుంది. నీ ధారణ గొప్పది; గురుసన్నిధిలో నేర్చినది, మనన నిధిధ్యాసనాలతో సంపాదించినది ప్రతి అక్షరం నీకు వాచోవిధేయం. నీ కవిత ఆంధ్ర సంస్కృతోభయ కూలంకషమై ప్రవహించే బ్రహ్మపుత్ర. కనుకనే నీవు బ్రాహ్మీభూషణ, ఆంధ్రబిల్హణ, సుధీంద్రమౌళి బిరుదభాసురుడవైన సాహిత్య శిరోమణివి.

నెచ్చెలీ ! నీవు పండ్లతో వంగిన గున్నమామిడివి; అందుకోని వానిదే లోపం ఆర్తులపాలిటి తంగేటి జున్నువి; జుర్రుకోని వానిదే జాగు. 'ఈ పని నీవల్లనే సాధ్యం, అని ఎవరు కోరినా నెత్తినపెట్టుకొని సాధించి సంతృప్తిపడడం నీకు చిన్ననాటినుంచి వచ్చిన బుద్ధి; ఇది జీవితానువర్తిని.

ఇన్ని మించుతనాలు, మంచితనాలు ఉన్న నీవూ ఒక మరపురాని మనీషివి. చంద్రుని కొక నూలుపోగని సామెత. కాని, నేను మిత్రుని కొక నూలుపోగుగా ఈ చిన్న కృతిని 'మరపురాని మనీషి'ని నీకు మన చెలిమికి గుర్తుగా అర్పిస్తున్నాను; స్వీకరించు

నీ వాడు

**తిరుమల రామచంద్ర**



# అనుక్రమణిక

## మరపురాని మనీషులు



# శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి

1934 నాటిమాట. గుంతకల్లు రైల్వేజంక్షనులో గుంటూరుబండిలో దాక్కున్న ఒక యువకుణ్ణి కొందరు బలవంతంగా దింపి, పూనా బండి ఎక్కించడానికి ప్రయత్నిస్తున్నారు. వారంతా కొల్హాపూర్ వెళ్లుతున్నారు. ఆ యువకుడు "అబ్బే! నేనురాను. నాకు భయం వేస్తూంది. హరిప్రసాదరావుగారి లాగ మెప్పించగలనా హరిశ్చంద్ర వేషం ? చూచిన వారు ఏమంటారు? గుంటూరుకు టిక్కెట్టుకూడా కొన్నానే. రానంటే రాను" అని గింజుకుంటున్నాడు. అందరూ కలిసి అతణ్ణి పట్టుకు లాక్కుపోయి ఉత్తరకుమారుణ్ని అర్జునుడు రథానికి కట్టివేసినట్టు పూనాబండిలో ఎక్కించి పెట్టె తలుపులు బిడాయించి, సీటుకు కట్టివేసినంత పనిచేశారు. బండి కదిలింది.

ఆ యువకుని చిన్ననాడూ - 1916 లో ఇలాటి తమాషాయే జరిగింది. రాజమండ్రికి ఏదో చుట్టపుచూపుగా వెళ్ళాడు. అతనిది కమ్మని శారీరం. చిన్ననాటినుంచే కమ్మగా పాడేవాడు కూడా. స్నేహితులు ఆయనను నాటకానికి పిలుచుకొని వెళ్లారు. పాట పాడుతాడని, 'పాడించండీ అంటే పాడించండీ' అన్నారు నలుగురూ. అక్కడి

నాటకసంఘం యజమాని కృత్తివెంటి గున్నేశ్వరరావు యువకుణ్ని కౌగిలించుకొని "మా కంపెనీలో ఉండిపోవోయ్! నెలకు 25 రూపాయలు జీతం" అంటూ బయానాగా 300 రూపాయలు దోసిట్లో గుమ్మరించాడు.

"నేను నాటకాలలో వేషాలు వేయడానికి రాలేదు. టీచర్స్ ట్రెయినింగ్ అయిన వాణ్ణి, మాస్టరీ చేసుకుంటాను" అని యువకుడు మొరపెట్టుకున్నాడు. పదిమందీ కలిసి ఎలాగో ఒప్పించారట. నెలకు పాతిక జీతం 300, బయానా అంటే యువకుని మనస్సు కొంతమారింది. (స్కూలు మాస్టరుగా ఉంటే ఎలా ఉండేదో!)

ఆ యువకుడు ఎవరనుకున్నారు? దాదాపు నాలుగు దశాబ్దాలపాటు నటన రంగంలో కరుణారసప్రవాహాలు పారించి సహృదయులను ముంచెత్తిన నటసార్వభౌములు శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి గారే.

నాటకరంగంలో అద్దంకివారు వేయని వేషమంటూ లేదు. వివిధ పాత్రలను నిర్వహించారు, అన్నిటా సమానమైన సమర్థతతో, పాత్ర వైవిధ్యంతోపాటు నటన వైవిధ్యమూ, నైపుణీ మెరుగెక్కేవి. ఏ నాటకంలోనైనా కింది వేషం మొదలు పై వేషంవరకూ వేసేవారు. సీతతో ఆరంభించి దశరథునిలోను, మునికుమారునితో ఆరంభించి కణ్వునిలోను, సహదేవునితో ఆరంభించి ధర్మరాజులోను వారి అభినయ చాతురి పరాకాష్ఠ నందుకొంది.

ఎన్నో వేషాలు వేసినా, మూడింట మాత్రమే వారికి మన్ననా, మక్కువా ఎక్కువ. అవి ధర్మరాజు, కణ్వుడు, దశరథుడు. పాండవ విజయంలో వారు ధర్మరాజై మరణించిన అభిమన్యుని "ఆకర్ణాంతములైన ఆ కనులు . . . ఆ మోకాల్మీదికి జారు చేగవ" అని పద్యం పాడుతూ ఉంటే ప్రేక్షకలోకం ఏడిచేది.

అలాగే కణ్వుడుగా శకుంతలను హస్తినాపురికి పంపుతూ, కాళిదాసు శ్లోకం చదివి, "కొందలమందె డెందము" అని కందుకూరివారి పద్యం అందుకుంటే, ప్రేక్షకుల డెందాలు కొందలమందేవి.

దశరథ పాత్రధారణలో వారు పరాంకోటిని అందుకున్నారు. దశరథుడు ఎలాటివాడో ఎవరూ చూడలేదుగాని, అద్దంకి అపరావతారమేననే ప్రథ పడిపోయింది. అప్పుడు దశరథ పాత్రధారణలో పేరుగన్న ఆలమూరి పట్టాభిరామరావుగారు అద్దంకి వారి దశరథపాత్ర చూచి "ఇక నేను సంతృప్తిగా విరమించుకొంటాను" అన్నారట.

అద్దంకివారు ఈ మూడు పాత్రలూ సాధించారు. నాటకాలలో పద్యం చదవడానికి ఒరవడిపెట్టారు. వారి గమకం (పద్యపఠనం) పద్యానికేవన్నె తెచ్చేట్టుఉండేది. అవసరమైనంత రాగం, భావస్ఫురణకు ఆవశ్యకమైనంత మాత్రమే. దానితో ఏదో వచనంలో సంభాషిస్తున్నట్లే, స్వాభావికంగా ఉండేది. రాగం రేఖామాత్రంగా చూపేవారంటే సంగీతం రాదని కాదు. సంగీతంలో కచ్చేరీలు చేసిన విద్వాంసులు.

అద్దంకివారు ఇంతటి ప్రావీణ్యం గడించడానికి కారణమేమిటి ? "పూర్వం ప్రతి నాటక సంఘానికీ పాటలకు ఒక్కరూ, నటనకు ఒక్కరూ శిక్షకులు ఉండేవారు. అందువల్ల ఏ నాటకమైనా పక్వంగా తయారయ్యేది. బి. టి. రాఘవాచార్యులగారివద్ద ఒక్కొక్క పాత్రను ఎంతో అధ్యయనంచేసి నటించే వాళ్ళం. తర్వాత యడవల్లి సూర్యనారాయణ పెద్దన్నయ్యలాగ ప్రతిదీ నేర్పేవాడు" అంటారు వారు.

అద్దంకివారి పితృపాదులు వెంకటరాయడుగారు గొప్ప హరిదాసు. వంశమా భాగవత వంశం. పితృపాదులు ఒంగోలు తాలూకా కలువకూరులో నిర్యాణం చెంది నప్పుడు ఊరు ఊరే ఆయనకు పాదాభివందనం చేసిందట. ఆ సౌమ్యత, గాంభీర్యం పుత్రునిలోనూ ఉన్నాయి.

అద్దంకివారు 14వ ఏటనే, 1911 లోనే నాటకజీవితం ప్రారంభించారు. అప్పుడు వారు బాపట్ల బోర్డు హైస్కూలులో నాల్గవ ఫారం విద్యార్థి. శ్రీ పంచాపకేశయ్యర్ హెడ్‌మాస్టరు. తల్పశాయి, మద్రాసు మాజీ న్యాయమూర్తి చింతగుంట రాఘవరావు సతీర్థ్యులు. పాఠశాల వార్షికోత్సవంలో తొలిసారిగా రంగు పూసుకున్నారు. గయోపాఖ్యానంలో సహదేవుడుగా.

చిన్నప్పటినుంచీ వ్యాయామంపై ప్రీతిహెచ్చు. కుస్తీలు పట్టేవారు. ఉపాధ్యాయ శిక్షణలో డ్రాయింగు, జిమ్నాస్టిక్స్‌లో ముందుండే వారు. కాని, జీవితగతి మారి నాటకాలలో పడ్డారు. రాజమండ్రిలోని కృత్తివెంటి గున్నేశ్వరరావు నాటక సంఘంలో కొన్నేళ్ళు, ఏలూరులో మోతే నారాయణరావుగారి సీతారామాంజనేయనాటక సమాజంలో పదేళ్ళు పనిచేశారు. మైలవరం కంపెనీలో కొంతకాలం ఉన్నారు. యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, పారుపల్లి సుబ్బారావు మొదలయిన వారు వారి సహనటులు. మోతే వారిని "ఆయన నాకు చాల సహాయంచేశారు. గొప్ప కళాభిమాని" అని ఎంతో గౌరవంతో స్మరిస్తారు అద్దంకివారు.

సంగీతం బాగా రానిదే ప్రయోజనం లేదనుకున్నారు. ఒకప్పుడు వేషాలు వేయడం మాని, పుష్కరం పాటు గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యగారి వద్ద సంగీతం సాధనచేసి, పదేళ్ళపాటు పాటకచ్చేరీలు చేశారు. పారుపల్లి సుబ్బారావు జొన్నవిత్తుల శేషగిరిరావు మొదలయిన వారితో చేరి సంగీత నాట్యమండలి స్థాపించి నిర్వహించారు.

వివిధ పాత్రలను నిర్వహించారు. అందరినీ మెప్పించారు. పెక్కు సన్మానాలు పొందారు. 1924 లో మద్రాసులో కాశీనాధుని నాగేశ్వరరావుగారు బంగారు పతకం బహూకరించారు, దశరథ పాత్రకు విస్మితులై.

ఇంతలో నాటకాలను మింగి ముందుకువస్తున్న చలనచిత్ర కళ వీరిని ఆకర్షించింది. 1934లో హరిశ్చంద్ర వేషంతో సినిమా జీవితం ప్రారంభమయింది.(అప్పటి

సంగతినే మొదట పాఠకులు చదివారు) చంద్రమతి శ్రీమతి కన్నాంబ. అద్దంకివారు దాదాపు ఇరవై చిత్రాలలో నటించారు. ఈ సినిమాజీవితం 1948 లో నహుష పాత్ర ధారణతో ఆఖరయింది. పదిహేను సంవత్సరాలపాటు సినిమాజీవితం ఉజ్వలంగా సాగింది.

1949లో అద్దంకివారు సినిమానుంచి తిరిగివచ్చి చూస్తే, పరిస్థితి తారు మారయింది. నాటక ప్రపంచ స్వరూపమే మారిపోయింది. మునుపటి సాధన, గురు ముఖతః నేర్వడం అంతరించాయి. పౌరాణిక నాటకాలు అవసరం లేదనే వాదం బయలుదేరింది. ప్రాచీన నాటకాలపట్ల అభిరుచీ అంతంతమాత్ర మయింది. ముగ్గురు కృష్ణుల, నలుగురు ధర్మరాజుల, అయిదుగురు సీతల నాటకాలు వచ్చాయి. అయినా, వారు అడపా దడపా వేషాలు వేయడం ఉండనే ఉండేది.

1854 నుంచి విజయవాడలో బుడమేరు కొత్తవంతెనవద్ద తోటలో ఆశ్రమం వంటి ప్రశాంతమైన గృహంలో నివసిస్తున్నారు. ఇద్దరు కుమారులు, అయిదుగురు కుమార్తెలు సతీమణి శ్రీమతి దుర్గామహలక్ష్మిగారు. ప్రస్తుతం అరవైఅయిదో ఏడు. షష్ఠిపూర్తి దాటేవరకు జిర్రున చీది ఎరుగరు. జ్వరమనేదే తెలియదు. తోటకు కాపలా రెండు జాతి జాగిలాలు. ఆయనకు కుక్కలంటే మొదటినుంచీ మోజే. కాని ఇప్పుడు అవసరమైంది.

ఇటీవల అమలాపురంలో శాకుంతలంలో కణ్వపాత్ర ధరించి "యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సం స్పృష్ట ముత్కంఠయా" అని కంఠం బిగించి ఉత్కంఠ చూపబోయారట. నాల్గవ తరగతి ప్రేక్షక మహాశయుడు ఒకడు "పెద్దగానోయ్!" అని కేక వేశాడట. దానితో "ఇక లాభం లేదు. మానాటి సంస్కారం గలవారు తక్కువవుతున్నారు. మైక్ లేకనే హాలు నలుమూలలా పాకేలాగ ఎంతో ముచ్చటగా నొక్కులునొక్కే పద్ధతి ఇకలేదు. ఇక తగ్గడం మంచిది" అనుకున్నారు. ఆ భావం సంకల్పంగాను, క్రియగాను మారింది.

"అదేమిటి? ఆమధ్యన చెన్నపురి వి. పి. హాలులో మీరు 'ఏకచ్ ప్యాలా' అనే మహారాష్ట్ర సాంఘిక నాటకంలో (తెలుగు అనువాదంలో) బారిస్టర్‌గా ఎంచక్కగానో నటించారే! పౌరాణికాలే కావాలా? సాంఘికాలు లేవా?" అని ప్రశ్నించాను.

వారు కండలుతీరిన చేత్తో పొగాకు ఈనెనుతీస్తూ "కోడి రామమూర్తిగారి లాగ సర్కసు కంపెనీ లేవదీద్దామనుకున్నాను. సంగీతంలో దిగాను. నాటకాలు, సినిమాలు-అలా ప్రవాహంలో కొట్టుకుపోయాను. నేను ఆగిపోయాను. ముందుకు సాగిపోతున్న వారిని పోనివ్వండి. వారిలో పడితే నేను రాణించనని అనుకుంటున్నాను. కనక, వారిలో దూరను. సంగీతంలోనే ఉంటే గొప్పవాడిని అయ్యేవాడిని" అంటూ చుట్ట చుట్టి వెలిగించారు.

కాని అద్దంకివారు అలా ఎంతమాత్రమూ పశ్చాత్తాప పడనక్కరలేదు. వారు సంగీతంలో ఉంటే అపర త్యాగబ్రహ్మ, వ్యాయామంలోనే ఉంటే రెండవరామమూర్తి అయ్యేమాట నిజమే. ఎక్కడున్నా వెలిగే జాతకమే. నటనలో దాదాపు అర్ధశతాబ్ది ఆంధ్రావళిని తనియించి, తామూ తనివి చెందారు. సార్ధక్యం పొందారు. ఇటీవలెనే వారిని ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీ ఫెలోషిప్పుతో గౌరవించింది.

నేడు "అనేక యుద్ధముల నారియు తేరిన" అద్దంకి వారివంటి పెద్దల నటనానుభవం ఈ తరంవారు వినియోగించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.





# శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

గోలుకొండ సీమ తెలుగు కావ్యాలలో ఎవడో "చిత్రాబుఖాను విభుడు" కనిపించాడు. సొంత పాండిత్యం వెలిగించ దలచిన లేఖకోత్తము డెవడో "చిత్రాబ్జఖాను విభుడు" అని సవరించుకొని వ్రాసుకొన్నాడు. చిత్రమనే అబ్జానికి ఖానుడేమిటి? అన్వయ మేమిటి? అర్థమేమిటి?—అనుకొని వీరేశలింగం పంతులుగారి వంటి వారే ఖానులోని 'ఖా' వ్రాలు సెబ్బర అనుకొని 'భా' గాదిద్ది చిత్రాబ్జ భానుడని సాధుపాఠం చేసుకొన్నారు.

ఇంతలో ఓరుగల్లు కోటలోని సంస్కృత శాసనాలలో ఒకవింత శాసనం కనిపించింది. దానిలో చిత్రాపఖానుడనే వాడు నాయకుడు. అతనికి దానిలోనే సీతాపఖాన అనే నామాంతరమూ ఉన్నది. ఓరుగల్లు కోటలో షితాబుఖాన్ దీవానే ఆమ్ (దర్బారు హాలు), షితాబుఖాన్ చబూతరా (వేదిక) అనేవి జనం అనుదినం చూస్తున్నవే. అంత వరకు ఇవేవో కట్టుకథలని అనుకున్న చరిత్ర పరిశోధకులను ఈ శాసనం నిజంవైపు మళ్లించింది. "వీడెవడో మనవాడే"నని షితాబుఖానును తనవాణ్ని చేసుకొనడానికి నిజాం

ప్రభుత్వం కలలు గనింది; పరిశోధించి తేల్చండని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారికి ఆ శాసన ప్రచురణకార్యం అప్పగించింది. కొమఱ్ఱాజువారు అదివరకే శివతత్త్వసారం పీఠికలో ఈవిషయాన్ని గుర్తుపెట్టుకోడంవల్ల పరిశోధన సులువైంది. కాని, దురదృష్టవశాత్తు వారిని ఆ కాలంలో కాలుడు కబళించి వేశాడు. ఆ పరిశోధనను ప్రభుత్వపరంగా కాకపోయినా ప్రజలపక్షాన, ప్రజలకోసం కొనసాగించి, షితాబుఖాను హిందువే కాని తదితరుడు కాడని, ఏ ముస్లిం సల్తనత్తుకూ మూలపురుషుడు కాడని, సీతడు సీతాపతిఅయి, ప్రభావ దినాలలో షితాబుఖాను, చిత్తాపుఖాను అని బిరుదాలు ధరించిన వాడని ఖైఫీయతులు మొదలయిన ఉపపత్తులతో, సాహిత్యంలోని ప్రస్తావనల ఉట్టంకనలతో నిరూపించారు. కొమఱ్ఱాజువారికి దీటయినవారు మరొకరు; నిజాంప్రభుత్వం కలలనుకల్లలుచేశారు. వారే శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు. అర్థశతాబ్దిపై చిలుకు తెలంగాణా చరిత్ర తిరగవేస్తే, సేవారంగంలో శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు, శ్రీ మాడపాటి హనుమంతరావుగారూ కవలలుగా కానవస్తారు. మాడపాటివారు సంఘసేవకు అంకితులైపోతే, ఆదిరాజువారు సారస్వతోద్యమానికి అంకితులయ్యారు. సేవారంగాలు వేరయినా, ఇద్దరిస్వభావాలు ఒక్కటే; ఒకే కార్యదీక్ష, తోటివారిపై ఒకే వాత్సల్యవీక్ష; ఒకే నిదానం, ఒకే ఆదాన ప్రదానం; ఒకే నిసర్గ మధురప్రకృతి; ఒకే నిరాడంబరోదారాకృతి; ఒకే అసిధారావ్రతం. ఒకే అచంచల నియమానువ్రతం, ప్రజానిధుల నిర్వహణలో అదేపొదుపు, అదేఅదుపు.

ఆదిరాజు వారు మధిర తాలూకా దెందుకూరులో 1887లో జన్మించారు. నందిగామ తాలుకా ఆదిరాజు వారి పుట్టి. వారి ఐదేళ్ళ ప్రాయంలోనే కరోడ్గిరి (కస్టమ్స్)లో గుమాస్తాగా ఉన్న వారి తండ్రి లింగయ్యగారు పరమ పదించడంవల్ల, తల్లి వెంకమాంబగారు చెల్లెలియింట, వారు (ఆదిరాజువారు) కొంతకాలం తిరువూరు తాలూకా, పెంగొలనులో మాతామహుల యింట కొంతకాలం పినతండ్రి, పెదతండ్రుల యింట గడపవలసి వచ్చింది. కనుకనే వారు 'నేను తండ్రిని ఎరుగను' అంటూ ఉంటారు. చింతకాణిలో పోలీసు ఠాణాలో నవిసిందా (రైటరు)గా పనిచేస్తున్న పెదతండ్రి రామకృష్ణరావు గారి యింట ఉన్నప్పుడూ, కొణిజెర్లలోనూ వారు వీధిబడిలో చదివారు. బడిలో వీణె సీతారామయ్య పంతులమెప్పు, ఠాణా లెక్కలు అని వ్రాసిపెట్టి పెత్తండ్రిగారి మన్ననా పొందేవారు. ఇలా పదమూడేండ్లు గడిచాయి.

కొడుకు ప్రయోజకత్వానికి వెంకమాంబగారు ఒకవైపు మురిసిపోతున్నా, ఆంగ్రేజీ చదువులు లేనిదే అతడు పెద్ద ఓహదేదారు కాడనే అనుమానం కలుగగానే, బల్దాకు (రాజధాని హైదరాబాదుకు) కొడుకుతో సహ పయనం కట్టారు. అప్పుడు రావిచెట్టు రంగారావుగారు హైదరాబాదునగరంలో ప్రముఖదేశభక్తులు, సారస్వతపోషకులు, వితరణశీలులు, తెలుగువారికి పట్టుగొమ్మ, నెలకు వంద రూపాయలు గౌరవవేతనం పొందుతున్న మన్సబ్‌దారు. వారి సతీమణి, వేంకమాంబ ఒకే యింటి ఆడబడుచులు. రంగారావు దంపతులు ఆ అభిమానంతోను, నిస్సంతువులు కావడంవల్లను, వారిద్దరికీ ఆశ్రయమిచ్చి ఆదిరాజు వారిని పుత్ర నిర్విశేషంగా చూడసాగారు.

ఆదిరాజు వారి జీవితం మూరాకు తొడిగింది. చాదర్ ఘాట్ హైస్కూలులో ఇంగ్లీషు మూడవ తరగతి (ఫస్ట్ ఫారం) లో చేరారు. ఇంట్లో చెప్పించుకొని 1903లో అయిదవ తరగతి (థర్డ్‌ఫారం) ప్రభుత్వ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. అప్పుడు అయిదవ తరగతిలో మిడిల్‌స్కూలుముగిసేది. తర్వాత ప్రీమెట్రిక్, మెట్రిక్, హైస్కూలు మొత్తం రెండు సంవత్సరాలే. వార్షిక పరీక్షలు డిసెంబరులో జరిగేవి. ఆదిరాజు వారు తర్వాత రెండు సంవత్సరాలు హైస్కూలులో చదివి మెట్రిక్ పరీక్షకు కట్టారు. కాని శీతకాలం వారి శరీర తత్వానికి సరిపోనందున పరీక్షకు వెళ్ళలేక పోయేవారు. అంత తోనే వారి బడిచదువు ఆగింది.

కాని రావిచెట్టు వారి గృహం ఆనాడొక సారస్వత కేంద్రం కావడంవల్ల, నేటి కృష్ణ రాయాంధ్రభాషానిలయం (1901) విజ్ఞాన చంద్రికా గ్రంథమాల (1905) నాడు వారి యింటనే మొలకెత్తడంవల్ల, రావిచెట్టు వారి పక్షాన నూనుగు మీసాల ప్రాయము ననే ఆదిరాజు వారే గ్రంథాలయాన్ని, గ్రంథమాలను నిర్వహించవలసి రావడంవల్ల కొమర్రాజు వారి మార్గ దర్శకత్వం ఆనుషంగికంగా లభించడంవల్ల ఆదిరాజు వారి ప్రతిభ వేయి రేకులుగా విరిసింది; బుద్ధి పరిశ్రమ ప్రవణ అయింది.

ఆదిరాజు వారు 1906 లో గృహస్థులయ్యారు. వారి సతీమణి శ్రీమతి లక్ష్మీ నరసమ్మగారు అన్నివిధాల వారికి ప్రతిచ్ఛాయ. కొమర్రాజువారు, మునగాల రాజాగారి దావాలకోసం మద్రాసులో ఉండటంవల్ల, ఇతర కారణాలవల్ల రావిచెట్టువారు విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను 1908 లో మద్రాసుకు తరలించారు. ఆదిరాజువారు ఊరికే చుట్టపుచూపుగా చూసిరావడానికి మద్రాసు వెళ్ళారు. రావిచెట్టువారు వారిని అక్కడే ఆపివేసి, గ్రంథమాల పనులు చూడమన్నారు. అప్పుడు గ్రంథములకు గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు కార్యదర్శి: వారు స్వరాజ్య పత్రికలో సర్ ఆర్థర్ లాల్‌ను 'అరెరే సర్ ఆర్థర్ లాల్ క్రూర వ్యాఘ్రమా!' అంటూ విమర్శిస్తూ వ్యాసం వ్రాసి నందుకు క్రిందికోర్టు ఎనిమిదినెలలు శిక్షవిధించింది. హైకోర్టుకు అప్పీలుచేయగా రెండు సంవత్సరాలని దీర్పుచెప్పింది. అప్పుడు పోలీసు సోదా అతితీవ్రం గనుక ఆ కాగితా లన్నీ తగులబెట్టాము" అని ఆదిరాజువారు ఆ నాటి ముచ్చట్లను మహోత్సాహంతో చెబుతూ ఉంటే శ్రోతలు మైమరచి పోతారు.

మద్రాసు నివాసం వారి సర్వతో ముఖాభివృద్ధికి అవకాశాలు తీర్చింది. వారికి సహకార్యకర్తలు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆదిపూడి సోమనాథరావుగారు. కొమర్రాజువారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ కార్యకలాపం కొంత ఆదిరాజువారితోనూ నడిపించేవారు. అయితే, వారి మద్రాసు నివాసం అట్టేకాలం సాగలేదు. 1910 లో రావిచెట్టువారు కాలధర్మం చెందారు. ఆదిరాజువారి తల్లిగారూ పరమపదించారు. కొమర్రాజువారుకూడా దావాలు పూర్తికాగానే నడిగూడేనికి మకాం మార్చారు. విజ్ఞాన

చంద్రికా గ్రంథమాలనిర్వహణ ఆచంట లక్ష్మీపతిగారి వశమయింది. ఈ పరిస్థితిలో మనస్సు బాగులేక 1914 లో ఆదిరాజువారు హైదరాబాదుకు తిరిగివచ్చారు.

తిరిగివచ్చిన తర్వాత వారి జీవితం వారి స్వభావానికి అనుగుణమైన, ప్రశాంత మైన ఉపాధ్యాయవృత్తిలో నల్లేరుపై బండివలె నడిచిపోయింది. మహబూబు కాలేజీలో ఏడేళ్ళపాటు, తాము చదువుకున్న చాదర్‌ఘాట్ హైస్కూలులో ఇరవయ్యేడేళ్ళపాటు ఆంధ్రోపాధ్యాయులుగాను, స్కౌట్ మాస్టరుగాను ఉండి 1948 లో పదవినుంచి విరమించారు. అనంతరం నారాయణగూడ బాలికల ఉన్నత పాఠశాలలో ఐదు సంవత్సరాలపాటు పనిచేసి, 1953 నుంచి సంగ్రహ విజ్ఞానకోశంలో ఎడిటోరియల్ సూపరెంటెండెంటుగా పనిచేస్తున్నారు. చిన్నప్పుడు కొమర్రాజువారివద్ద పొందిన అనుభవం విజ్ఞానకోశగ్రంథనంలో పనికివచ్చింది.

"జీవనోపాధికి వేరే పనిచేస్తూ, 'స్పేర్ టైం'లో ఏదో సారస్వతసేవ చేసే వాణ్ణి"అని వారు తన సేవను చప్పరించి వేస్తారుగాని, తెలంగాణాలో వారు లేని సారస్వతోద్యమంలేదు: వారు కనిపించని సారస్వత సంస్థలేదు. కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయానికి వారు రకరకాల హోదాలలో సేవచేశారు. విద్యార్థిదశలోనే వారు దానికి మొట్టమొదటి లైబ్రేరియన్. ఆంధ్రోద్యమానికి మూలస్తంభాలలో ఒకరు. 1921 లో శ్రీ మాడపాటివారు మున్నగువారితోపాటు ఆంధ్ర జనసంఘం స్థాపించారు దానికి కార్యదర్శిగాను ఎన్నికయారు. దానికి అనుబంధంగా మరుసటి సంవత్సరం ఆంధ్ర పరిశోధకమండలి నెలకొల్పారు. దానిని కొమర్రాజువారి అస్తమయానంతరం లక్షణరాయ పరిశోధక మండలిగా మార్చారు. దానికి నేటివరకూ వారే కార్యదర్శి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, విజ్ఞానవర్ధినీ పరిషత్తు, ఆంధ్రచంద్రికా గ్రంథమాల మొద లయిన పెక్కు సంస్థల మూలపురుషులలో వారూ ఒక్కరు. తెలంగాణా సాంస్కృతిక సారస్వత పునరుజ్జీవన చరిత్రే వారి సేవాచరిత్ర అంటేచాలు. అందుకే వారికి తెలం గాణాలో అన్నిచోట్లా సన్మానాలు, అంతటి గౌరవాదరాలూనూ.

వారి కార్యదర్శిత్వంలో లక్ష్మణరాయ పరిశోధకమండలి చేసినసేవ అసదృశం తెలంగాణా శాసనాలు రెండు సంపుటాలు, షితాబుఖాను ప్రచురించింది." అన్ని ఇబ్బందులలో అంతటి పని ఎలా చేయగలిగారు? అని ప్రశ్నిస్తే "ప్రతిదానికీ సర్కారు నిగా ఉండేది. అందులో నేను సర్కారు నౌకరును. అడుగడుగునాచిక్కులే. ఒకమారు శాసనాలకోసం నిరశన దీక్షకూడా చేశాను. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అధికారరీత్యా తాళపత్రగ్రంథాల సేకరణకు వస్తేనే మొదట్లో నిజాం ప్రభుత్వం అనుమతించలేదు. తర్వాత లండన్‌నుంచి తాఖీదురాగా తలఒగ్గింది." అని తమ తాళ పత్ర, శాసనగవేషణ గాథలు చెబుతూపోతారు వారు.

వారికి చిన్ననాటినుంచే సరళసుందర రచన అలవడింది. ఎప్పుడో పద్యాలూ చెప్పడానికి ప్రయత్నించారట. కాని కవనంకన్నా వచనం ఎక్కువ ప్రయోజన

కరమని ఆదిపూడి సోమనాధరావుగారి సలహాపై వచనరచనకే పూనుకున్నారు. వారి మొట్టమొదటి ముద్రితగ్రంథం రావిచెట్టు రంగారావుగారి జీవితం. అముద్రితాలు చిత్ర శాకుంతలం మొదలయినవి ఎన్నో! అప్పటినుంచి పుంఖాను పుంఖంగా చారిత్రక, మానవజాతి పరిశోధకవ్యాసాలు వందలాదిగా వ్రాశారు. వ్రాస్తున్నారు. వాటిలో కొన్ని ప్రాచీనాంధ్ర నగరాలు, తెలంగాణము, లలితకథావళి గ్రీకు పురాణగాధలు మొదలయిన సంపుటాలుగా వెలువడ్డాయి. 'గ్రీకు పురాణగాధలు'ను గురించి కొంత గాధవుంది. వారు చాదర్ఘాట్ హైస్కూలులో ఏదో భారతీయ పురాణకథ పాఠం చెబుతున్నప్పుడు ఒక క్రైస్తవ విద్యార్థి ఆక్షేపించాడుట. 'జాతి ఎంత ప్రాచీనమైతే అంత ఐతిహ్యాలుంటాయి. బైబిలులో నీళ్లమీద నడవటంవంటి కథలలాగే ప్రతిపురాణ గాధలూ ఉంటాయి" అంటూ నచ్చచెప్పి ప్రాచీన పాశ్చాత్య మతగాధలు అవలోడించి, పూర్వగాధాలహరిలాగ 620 గ్రీకు పురాణకథలు వ్రాశారు. వాటిలో కొన్ని ఈ సంపుటం. వారి మరొక అపూర్వ పరిశ్రమ కాకతీయాంధ్ర దర్శిని.

ఆదిరాజువారు ఆలస్యంగా పడుకొని ఆలస్యంగా లేస్తారు. పగలు నౌకరీ, ఇతరవేళల్లో ప్రజాకార్యం చేయటంవల్ల ఇది అలవాటయింది. చదువూ, వ్రాతా రాత్రిళ్లే. ఉదయం, సాయకాలం వారే పాలుపితుకుతారు. ఇప్పుడు వారింట ఉన్న గొడ్డూగోదా ఎవరో కసాయి కబేలాకు తోలుకుని పోతున్న నిండుచూలాలయిన గోమాత ఆరవతరం. తువ్వాయిలన్నీ వారి ఒడిలోనే పెరిగాయి. వారికి పిల్లలులేరు. తమకు నచ్చినవారిని పెంచడం, వారికి పెండ్లి పేరంటం చేయడం, వారి ముచ్చట్లు చూచి మురిసిపోవడం వారికి సరదా. ఈ సరదాలను వరుసగా తీర్చుతున్న వారి సతీమణి పరదాలు లేని మనస్సును మెచ్చుకోవాలి.

"నాకు తెలియని విషయాలు తెలుసుకున్నాను. వాటిని ఇతరులకు తెలుపుదామనే ఉద్దేశ్యంతో ఏ పనైనా చేశాను." అని వారు అన్నప్పుడు ఆ తరంవారిపైనే అపారభక్తి ఏర్పడుతుంది. అదొక కోవ. పాండిత్యం పండినకొద్దీ ప్రశ్రయంతో పరువమయ్యే చేవగలకోవ. ఆ గుణాలు నేడు రెండు పంక్తులు వ్రాయగానే డిండిమం వాయించుకునే వారికి అబ్బితే, ఎంతో మేధ సార్థకమయ్యాని!





# శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి

శ్రీ కామరాజు వెంకటప్పయ్యగారు 1928 లో నందిగామలో తాసీల్దారుగా ఉన్నప్పుడు తన కింది కరణాలను పిలిపించి తన కుమారితకు మంచి సంబంధంచూడ మన్నారు. అప్పుడు ఆమెకు పన్నెండేండ్ల ప్రాయం. రెండవఫారం చదువుతున్నది. కరణాలు శ్రద్ధగా మంచి సంబంధం చూశారు. ఇల్లిందల వారి అబ్బాయి. పేరు సీతా రామరావుగారు. తాసీల్దారుగారింటి పెండ్లి మహావైభవంగా జరిగింది.

పెండ్లి కుమార్తె కాపురానికి వెళ్ళింది. పుట్టిన ఇల్లూ, మెట్టిన ఇల్లూ నవీనతకు ఉన్ముఖమైనవే. కనుక అమె ఆంధ్రప్రదేశ్ రాజధానిలోని స్టాన్‌లీ గర్ల్స్ హైస్కూల్లో చేరింది. నాలుగేళ్ళు గడచాయి. మెట్రిక్యులేషన్ పరీక్షల సమయం. ఆమెకు మరొక పెద్ద పరీక్ష ఏర్పడింది. పిల్ల తల్లి అయింది. ఇంత చిన్నతనంలోనే తల్లి నయ్యానే అనే సంకోచంతో, పరీక్షకు వెళ్ళలేకపోయానే అనే ఆవేదనతో ఆమెలో జిజ్ఞాస వేయి పడగలతో విజృంభించింది. 'ట్రూ స్టోరీ మేగజెన్' వంటి ఉబుసుపోక కథల పత్రికలను చదవడమే కాక, తీరని జిజ్ఞాసతో ఎంతో అధ్యయనం చేసింది. భర్త అప్పటికి ఎమ్మెస్సీ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విజ్ఞాన శాస్త్రోపన్యాసకులు, ఎంతో ప్రోత్సహించారు. ఆమె జిజ్ఞాస జ్ఞానార్జనతోనే ఆగలేదు. ఆమెను కార్యప్రవీణురాలినిగా చేసింది. ఆమె తన జ్ఞానాన్ని మహిళాజనసేవకు వినియోగించింది. తన మాటలను చేతలగానూ మలచింది. ఆమే శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు.

ఆ రోజులలో తెలంగాణాలో మహిళల పరిస్థితివేరు. ముస్లింలు చాల ముందంజ వేసేవారుగాని, హిందూ మధ్యతరగతి మహిళలు ఎంతో వెనుకబడి ఉండేవారు. ఇక పై తరగతి స్త్రీలసంగతి చెప్పనక్కరలేదు అసూర్యంపశ్యలు. విద్యార్థినీ దశనుంచే ఆంధ్ర మహిళాసభ కార్యకలాపాలలో ప్రత్యేకశ్రద్ధ వహిస్తున్న ఇల్లిందల సరస్వతీ దేవిగారికి హిందూ మధ్యతరగతి మహిళలకోసం ముఖ్యంగా తెలుగువారి ప్రగతికోసం ప్రత్యేకంగా ఒక సంస్థ నెలకొల్పడం అవసరమని తోచింది. శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారితో కలిసి 1934 లో ఆంధ్ర యువతీ మండలి స్థాపించారు. శ్రీమతి రంగమ్మ ఓబులరెడ్డిగారు అధ్యక్షులు.

ఆంధ్ర యువతీమండలి స్థాపనమేమో జరిగింది. దానికి సభ్యురాండ్రను చేర్చడం మహాయజ్ఞ మయింది. అప్పటి కష్టానుభవాలను ఇల్లిందలవారు చెబుతూ ఉంటే ఆశ్చర్యం కలుగుతుంది, ముచ్చటగానూ ఉంటుంది. 'సభ్యురాండ్రను చేర్చుకొనడానికి బయలుదేరే వారం. గౌరవ కుటుంబాలవారు వెలుపలికి వచ్చేవారుకారు. సంస్థానాల రాణీగార్లు, జాగీర్దారిణీగార్లు మాతో ముఖాముఖిగా మాట్లాడే వారు కారు. పరదా వెనక లీలగా కనిపిస్తూ చెలికత్తెలద్వారాగాని. ఆయాలతోగాని కబురు పంపేవారు. సముఖాన రాయబారం అంటే ఇదే కాబోలునని అనుకునేవారం. సభ్యత్వపు జాబితాలో తమ పేర్లు తమ బిరుదావళితో సహా వ్రాయాలని పదేపదే చెప్పేవారు. మండలికి కీర్తిశేషులు ప్రతాపరెడ్డిగారు 'అసతోమా సద్గమయ' అనే నినాదం సూచించారు. డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారు నియమావళి సిద్ధపరచారు.

ఇల్లిందలవారు ఈ విధంగా శ్రమపడుతూ పన్నెండు సంవత్సరాలపాటు కార్యదర్శి, ఉపాధ్యక్ష పదవులను నిర్వహించి మండలిని పెంచి పెద్దచేశారు. డా. బూర్గుల రామకృష్ణారావుగారి సతీమణి శ్రీమతి అనంతలక్ష్మీదేవిగారు అధ్యక్షస్థానం అలంకరించినప్పుడు మండలి బర్కత్‌పురాలో పెద్ద భవనం నిర్మించుకొంది. మండలి నేడు శిశువిహారం మొదలయిన అనుబంధ సంస్థలతో పిల్లలకోడి లాగ, పండ్లతీగలాగ కనుల పండువు చేస్తున్నది. ఇల్లిందల వారిప్పుడు మండలికి శాశ్వతసభ్యులు.

ఇల్లిందలవారి కార్యదక్షత ఆంధ్ర యువతీమండలికే పరిమితం కాలేదు. వారు భారత సంఘ సంక్షేమ మహాసభ తాలూకు ఆహార సంఘంలో సభ్యులుగాను, బందీఖానాల, ఆస్పత్రుల పర్యవేక్షకులుగాను, శిశు సంక్షేమ సంఘసభ్యులుగాను ఉంటూ ఎన్నో నూతన పథకాలు సూచించారు. వాటిని ఆచరణలో పెట్టించారు. సంఘసేవ జీవితలక్ష్యం కావడం వల్ల సాహిత్య సంస్థలతోను వారికి సంబంధం అనివార్యమైంది. ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వాహక సభ్యులుగాను హైదరాబాదు నగరంలో ప్రాచీనతమమైన కృష్ణదేవరా యాంధ్ర భాషానిలయానికి పెక్కు సంవత్సరాలు నిర్వాహక సభ్యులుగాను, దక్షిణభారత హిందీ ప్రచారసభ హైదరాబాదు శాఖకు కొన్నేళ్ళు నిర్వాహక సభ్యులుగాను, ఉపాధ్యక్షులుగాను, కేంద్ర గ్రంథాలయ శిశుశాఖ సభ్యులుగాను

ఉంటూ గుప్తంగా చేస్తున్న సేవ పలువురికి తెలియదు. ఇక సాంఘిక, సారస్వతసభ లకు అధ్యక్షత వహించడం వంటిది లెక్కలేనన్నిసార్లు.

ఇల్లిందలవారు కళ కళకోసమన్నట్లుగా రచన రచనకోసం చేపట్టలేదు. వారు దానిని సంఘసేవలో సాధనంగాను, అజ్ఞాన తమస్సును పోగొట్టే కరదీపికగాను భావించే కథలు, వ్యాసాలు మొదలయినవి వ్రాశారు. వారి మొదటి కథ, మొదటి వ్యాసం 1933లో గోలుకొండ పత్రికలో ప్రచురితమయ్యాయి. తర్వాత పదేళ్ళలో హైదరాబాదులో రేడియో కేంద్రం నెలకొల్పడం, తెలుగుకు అవకాశం కలగడం తట స్థించాయి. శిశు మహిళా జనోద్ధరణ లక్ష్యంతో వ్యాసాలు, నాటికలు, కథలు మొద లయినవి వ్రాయవలసి వచ్చింది.

రచయిత ఏమి చెప్పినా కాలానుగుణంగా చెప్పాలి. అదొక కళ. ఆ కళను వారు జర్నలిజం ద్వారా నేర్చుకున్నారు. చెప్పదలచిన విషయానికి 'లింక్' ఇవ్వడం వారు ప్రత్యేకంగా గ్రహించారు. ఈ మెలకువతోనే వారు పెక్కు సమకాలిక పత్రిక లలో వివిధ శీర్షికల క్రింద అనర్గళంగా వ్రాశారు. వారికిగల పత్రికా రచనానుభవాన్ని బట్టే, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జర్నలిజం తరగతులు పెట్టినప్పుడు వైస్ చాన్సలర్ డాక్టర్ దొరస్వామిగారు వారికి ప్రత్యేకంగా అనుమతి యిచ్చారు. అక్కడ కూడా వారు పరీక్షకు వెళ్లకపోవడానికి మరొక టేదో అడ్డువచ్చింది. వారు వ్రాసిన వివిధ రచనల సంపుటాలే జీవన సామరస్యము, నారీ జగత్తు, వెలుగుబాటలు, అక్క రకు వచ్చిన చుట్టము, ముత్యాల మనసు, పండుగ బహుమతులు, జాతిరత్నాలు, బాల వీరులు మొదలయినవి.

ఇల్లిందలవారి భర్త శ్రీ సీతారామారావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడరుగాను, డీన్‌గాను ఉన్నారు. బూర్గులవారు విద్యామంత్రిగా ఉండగా వారు విశ్వ విద్యాలయం నుంచి ప్రభుత్వ విద్యాశాఖకు తక్కిన వారితోపాటు బదిలీ అయి ట్రెయి నింగ్ కాలేజీ ప్రిన్సిపాలుగాను, విద్యాశాఖ డెప్యూటీ డైరెక్టర్‌గాను ఉండి, ప్రస్తుతం సిటీ సైన్సుకాలేజీ ప్రిన్సిపాలుగా ఉన్నారు. వారు చదివింది కెమిస్ట్రీ అయినా కవిత్వ మంటేను, సంస్కృతసాహిత్య మంటేను మహా యిది. ఇల్లిందల దంపతులకు ముగ్గురు కుమార్తెలు. ఒక కుమారుడు. ఇల్లిందలవారికి తోట పని, కసూతీపని చాల ఇష్టం.

ఇల్లిందలవారి తల్లి కామరాజు వెంకటలక్ష్మమ్మగారు బ్రహ్మసమాజ నాయకులు. దేశిరాజు పెదబాపయ్యగారి సోదరి కనుక ఇల్లిందల వారికి ఉగ్గుబాలతోనే సంస్కార భావాలు అబ్బినవి. కాని ఒక రిద్దరు పిల్లలు పోయిన తర్వాత సనాతనసాంప్రదాయం మీదా మక్కువ కలిగింది. కనుక తెల్లవారుజామున నాలుగు గంటలకే లేచి స్నానం చేసి ఆరుగంటలలోపుగా లలితా సహస్రనామం, శివ సహస్రనామం, శివపంచస్తవి పారాయణం చేస్తారు. మధ్యాహ్నం చదువు కుంటారు. సాయంకాలం సభల సమావేశా లలో పాల్గొంటారు. 1958లో ఆంధ్రప్రదేశ్ శాసనమండలి ఏర్పడినప్పుడు, వారి సంఘసేవకు పరిగణనగా సభ్యత్వం లభించింది.

వారి రచనలో వర్తమాన సమస్యలు ప్రధానం. 'నీలో అనేక శక్తులున్నాయి. వాటిని పైకి తెచ్చుకొని ప్రకాశించడానికి ప్రయత్నించండి. మగవారిపై కోపం వద్దు. అనే నేను నా రచనలలో సాటి మహిళలను కోరుతున్నాను. ఏదైనా యాచించడం వద్దు. సంపాదించుకోవాలి- అనే నేను హెచ్చరించాను. మహిళల మనసులో మగవారి పైగల దురభిప్రాయాలు పోవాలనే నమ్మకంతో వ్రాస్తున్నాను" అంటారు వారు

పూర్వ విషయాలు ఇప్పటివారికి ఎలా చెబితే తెలుస్తాయో వ్రాయడానికి ప్రయత్నిస్తున్నాను. నేను నా అభిప్రాయాలను నా దృష్టితోనే కాక యావద్భారత మహిళల దృష్టితోను తెలిపాను. స్వయంవరాధికారం, చల్లటి తల్లులు మొదలయిన వ్యాసాలలో ఈ విషయాన్ని చూడవచ్చు. మన సంప్రదాయం సరిగా తెలియక పోవడంవల్లనే ఇప్పటి వారు వాటిని వదులుతున్నారు" అని వారి అభిప్రాయం. ఏమైనా వారిరచనలు ధార్మికదృష్టి గర్భితాలు. కాని నవీనత నవనవలాడుతుంటుంది. "విశ్వనాథ వారి పుస్తకాలు. ముఖ్యంగా వ్యాసాలు నన్ను ప్రభావితం చేశాయి. ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకీయాలు నన్ను కర్తవ్యోన్ముఖిని చేశాయి" అని వారు అన్నమాటల యథార్థ్యం వారి రచనలు నిరూపిస్తాయి.

"నేడు ఆడవారెవరైనా వ్రాస్తే! వారెక్కడ వ్రాసి వుంటారోయ్! ఎవరో ఆసరా ఉంటారు. లేదా వారి పేరుతో ఎవరో వ్రాశారు-అన్నది నేటి మగవారి మనస్తత్వం. ఇది మారాలి." అన్నారు వారు. దొంగపేర్లతో. ఆడపేర్లతో వ్రాసే మగవారు మాటు మణిగే వరకు ఇలాటి కువిమర్శలు పోవు.

ప్రస్తుతం ఇల్లిందలవారు పెద్ద నవల నొకదానిని వ్రాస్తున్నారు. ఇది వారి రచనల కన్నిటికీ మణిపూసలాగా, మహాకావ్యంలా ఆంధ్రుల చేతిని అలంకరించగల దనే నమ్ముతున్నాను, మూడు దశాబ్దాల లోకవృత్త పరిశీలనానుభవంతో, వివిధ విషయాధ్యయనంతో రెండు దశాబ్దాల పుంఖానుపుంఖ రచనలతో రాణించే వారి లేఖిని ఈ నవలనూ జాతిరత్నంగానే సృష్టిస్తుంది.






# శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

అవి జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులు. జాతీయోద్యమానికి అంగోపాంగులుగా మహిళాభ్యుదయ సంఘ సంస్కార కార్యకలాపాలు శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న రోజులు. ఎందరో మహిళలు ప్రబోధ వ్యాసాలు వ్రాసేవారు; ప్రచారోపవ్యాసాలు జరిపేవారు, "మా చెట్టునీడ ముచ్చటలు" అనే శీర్షిక కింద లీలాదేవి అనే వారు వ్రాసేవారు. కొంతకాలానికి అవి ఆగిపోయాయి. "శారద లేఖలు" పుంఖానుపుంఖంగా శారద అనేవారు వ్రాసేవారు.

"మా చెట్టునీడ ముచ్చటలు" మదరాసు, నెల్లూరు, కర్నూలు, విశాఖపట్నం, గుంటూరు జిల్లాల అయిదుగురు ముత్తయిదువులు విజయవాడలో కాపురం ఉండి, ఆయింటి ఆవరణలోని నారింజ చెట్టుక్రింద కూర్చుని తమతమ యాసలతో వివిధ విషయాలను చర్చించే రచనలు. అవి దేశం స్వతంత్రం కావాలని పడిన ఆవేదనల

అచ్చట్లు. తెలుగునాడు సమైక్యం కావాలనే ముక్తా యింపుతో పొరపొచ్చం లేకుండా ఆడుకున్న ముచ్చట్లు.

"శారదలేఖలు" లో ఆ శారద ఒక్కొక్కప్పుడు కళా విశారదగా కనిపించేది. రాజకీయాల ప్రసక్తి వచ్చినప్పుడు, మహిషాసురమర్దనిగా సాక్షాత్కరించేది. సంఘ సంస్కరణ విషయాలు వచ్చినపుడు మైత్రేయిలాగ కనులగట్టేది. విద్యాసమస్యల చర్చలలో వాచక్కని గార్గిలాగ దర్శనమిచ్చేది.

ఎవరీ లీలాదేవి ? ఎవరీ శారద ? ఇద్దరూ ఒక్కరేనా ? వేర్వేరా ? అని పాఠకులు తహ తహలాడి పోయేవారు. మరోముచ్చటలో ఏమి తెలుపుతుందో, మరో లేఖలో ఏ పిడుగులవర్షం పడుతుందో అని వేయికళ్లతో వేచి ఉండేవారు.

ఆ లీలాదేవి, ఆ శారద పల్నాటి ఎర్రమట్టిరంగు ముతక ఖద్దరు చీర ధరించిన పెద్ద చదువూ, పదవీలేని కనుపర్తి వరలక్ష్మమ్మగారని అతిప్రయత్నం మీద తెలుసు కొన్న తర్వాత అందరూ ముక్కుమీద వేలువేసుకున్నారు. అయిదవ తరగతి అంతైనా చూడని ఈమె ఏమిటి ? ఆ రచనా రామణీయకమేమిటి ? ఈ సామి దేవమ్మ ఏమిటి ? రచనలలో ఆ సంఘ సంస్కరణ జ్వాలలేమిటి ? ఇంకా పట్టుమని పాతికేండ్లనా నిండని ప్రాయమే ! వ్రాతలలో ఆ విజ్ఞానప్రభ లేమిటి ? అనుకున్నారు అందరూను. కాని వరలక్ష్మమ్మగారి పుట్టిన ఊరూ మెట్టిన ఊరూ బాపట్లేనని, బాపట్ల ఆంధ్రోద్యమానికి పుట్టినిల్లు కావడమేగాక తక్కిన అభ్యుదయోద్యమాలకు కాణాచి అని ఎరిగినవారు మాత్రం "అచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ" అనుకొని తల ఊపారు.

కనుపర్తి వారి అదృష్ట మేమిటంటే, అన్నలయిన పాలపర్తి నరసింహం, కృష్ణమూర్తి, భావనారాయణగార్లు చిన్ననాటి నుంచీ చదువు సందెల విషయంలో ప్రోత్స హించడమూ, 1909 లో వివాహమయిన తర్వాత కూడా విదేశాలకు వెళ్లి విద్యనేర్చి వచ్చిన భర్త హనుమంతరావుగారు సంస్కారాభిలాషి గనుక ఎలాంటి ఆటంకమూ చెప్పకపోవడమూ, చిన్ననాటినుంచే చోరగుడి సీతమ్మగారివంటి విదుషీమణి సంఘ సేవ పరాయణ సాంగత్యం లభించడమూను. సీతమ్మగారు 1913 లో బాపట్లలో ప్రథ మాంధ్ర మహాసభ జరిపించిన చోరగుడి వెంకటాద్రి పంతులుగారి సతీమణి. సనాతను లకు ఆలవాలమైన బాపట్లలో త్రిపురసుందరీ సమాజమనే మహిళాసమాజం, యువతీ విద్యాలయం, రాత్రి పాఠశాల స్థాపించి సంఘసేవ చేసేవారు. సావిత్రి, హిందూ సుందరివంటి ఆనాటి స్త్రీ మాసపత్రికలలో వ్యాసాలు, కవితలు వ్రాసేవారు. ప్రథ మాంధ్ర మహిళాసభను జరిపించిన వ్యవస్థా నిపుణురాలు. ఆమె కనుపర్తి వారితో పత్రికలు చదివించుకొని వినేవారు. కనుపర్తి వారిది చిన్ననాటినుంచే మంచి వాచకం. సీతమ్మగారు ఆమె చదువుతుంటే విని ఎంతగానో ఆనందించేవారు.

ఆమె ప్రోత్సాహం వల్లనే కనుపర్తివారు యువతీ విద్యాలయోపాధ్యాయిని చాట్రాతి లక్ష్మీనరసమ్మగారి వద్ద సంస్కృతం, తెనుగు, పంచకావ్యాలు చదివారు. అప్పటినుంచి కనిపించిన ప్రతి తెనుగు పుస్తకమూ చదువనారంభించారు. ఆఖరుకు

పొట్లాలు కట్టివచ్చిన కాగితంకూడా వదిలేవారుకారు. ఈ పరిశ్రమతోనే వారు నర్సాపురం తాలుకా అభివృద్ధి సంఘం స్త్రీల బహుమతి పరీక్షకు వెళ్లి ఉత్తమశ్రేణిలో గెలుపొంది బంగారుపతకం పొందారు. విజ్ఞానచంద్రికా పరిషత్పరీక్షలకు, భక్తి ప్రచారిణీ పరీక్షకువెళ్లి నెగ్గారు.

కనుపర్తి వారి రచనావ్యాసంగానికి కూడా అన్నగారే ప్రోదిచేశారు. వారి తొలి రచన అనువాదం. (మన సాహిత్యావతారమే అనువాదంతోకదా). ఒక ఆంగ్ల కథను అన్నగారి సాయంతో 'సౌదామిని' అన్న పేరుతో అనువదించారు. అది 1919 లో 'అనసూయ' పత్రికలో ప్రచురితమయింది. అప్పటినుంచి వారి రచనా వ్యాసంగం అప్రతిహతంగా కొనసాగింది.

ఇంతలో కనపర్తివారు తమ జీవితాన్నే సంఘసేవకు అంకితంచేసే సుసంఘటన జరిగింది. 1921 లో బెజవాడలో అఖిలభారత కాంగ్రెసుస్థాయి సంఘ సమావేశం జరిగింది. ఆ సమావేశానికి గాంధీజీ మొదలయిన మహానాయకులు వచ్చారు. సమావేశం తర్వాత గాంధీజీ స్వరాజ్యనిధికోసం చరిత్రాత్మకమయిన భారత పర్యటన ఆంధ్రనుంచి ప్రారంభించి బందరు వచ్చారు. అప్పుడు బందరులో అన్నగారివద్ద ఉన్న కనుపర్తివారు జాతీయకళాశాలలో విడిసిన గాంధీజీని దర్శించి, తాము వడికిన ఖద్దరు నూలు, ఒక బంగారు ఉంగరం సమర్పించారు. అప్పుడు గాంధీజీ ఉల్లి పొరలాంటి గుడ్డలు ధరించిన కనుపర్తి వారిని చూచి "ఇక నుంచి ఖద్దరు ధరిస్తారా ?" అని ప్రాధేయపూర్వకంగా ప్రశ్నించారు. కనుపర్తి వారి ముఖం చిన్నబోయింది. "అలాగే" అని గాంధీజీకి వాగ్దానం చేశారు. అప్పటినుంచి ఖద్దరు వ్రతం పట్టారు. దానితోపాటే స్వరాజ్యలక్ష్మి వ్రతాలు రాట్నలక్ష్మి పూజలూను.

నాటినుంచి వారి జీవితధ్యేయమే మారిపోయింది. ఏది వ్రాసినా సంఘశ్రేయో లక్ష్య శుద్ధితో వ్రాయాలనే సంకల్పం కలిగింది. "మనంకథ వ్రాశామంటే, ఒక ఉత్తమమైన సందేశం ఇవ్వవలెననే ఉత్తమలక్ష్యంతో వ్రాయవలె. అంతేకాదు, తల్లీతండ్రీ, అన్నా తమ్ముడూ, అక్కాచెల్లెలూ అందరూ కలిసి అరమరలు లేకుండా ఒక్కచోట కూర్చుని చదువుకొని ఆనందించేదిగా ఉండాలె" అనే అన్నగారి ఉపదేశం ఉండనే ఉంది. కనుకనే ఆమె లక్ష్య శుద్ధి లేకుండా ఏమీ వ్రాయలేదు. అనవసరంగా ఏమీ వ్రాయలేదు. అందువల్లనే వారి రచనలతో అంత ఆవేగొ త్తేజాలు తొణికిసలాడడం. శారద లేఖలు రాజకీయాది వివిధ విషయాల చర్చకు స్వర్ణరేఖలు, సంఘదురాచారాలపై తీవ్రతర మయూఖలు కావడం.

కనుపర్తి వారు తమ పదునైన ఇతివృత్తం బలంతో పాఠకులను కథలవైపు ఆకర్షించారు. 'పెన్షను పుచ్చుకున్న నాటి రాత్రి' వంటి అపూర్వమైన కథలు దాదాపు అరవై వరకు వారి లేఖినినుంచి ప్రవహించాయి. పాఠక లోకాన్ని తన్మయం చేశాయి. వారి కథలు హిందీ తమిళ కన్నడాలలోను అనూదితాలయాయి. వారు కొన్నివందల వ్యాసాలు వ్రాశారు. 'స్త్రీ అబల కాదు' అనే గృహలక్ష్మి వ్యాసం పోటీలో వారికి

(1930 లో) సువర్ణ పతకం వచ్చింది. శారద లేఖలను డాక్టర్ కె.ఎన్. కేసరిగారు సంపుటంగా ప్రచురించి 1934 లో గృహలక్ష్మి సువర్ణ కంకణం బహూకరించారు. రచయిత్రులలో కంకణ స్వీకారానికి నాందీ ప్రస్తావన కావించిన వారూ వారే.

'వసుమతి' వారి తొలి పుస్తకం, సాంఘిక నవల. వారి నాటకాలలో 'పద్మ' సాంఘిక నాటకం. 'పునః ప్రతిష్ఠ' చాంద్రీక నాటకం. ద్రౌపదీవస్త్ర సంరక్షణం, సత్యా ద్రౌపతి సంవాదం ద్విపద రచనలు. మహిళా ప్రబోధం బుర్రకథ. ఇంకా ఎన్నో రచనలు. మహిళాప్రబోధంలో ఇతివృత్తం ఉన్నవ లక్ష్మిబాయమ్మగారి జీవితం. శారదా నికేతనం రజతోత్సవంలో సమర్పించబడింది.

క్రమంగా వారి జీవితం బహుకార్య వ్యగ్రమయింది. 1931 లో బాపట్లలో స్త్రీ హితైషిణీ మండలి స్థాపించారు. 20 సంవత్సరాలపాటు కార్యదర్శినిగా పనిచేశారు. దానికి శాశ్వత భవనం 1942 లో నిర్మించారు. దానికి గ్రంథాలయమూ ఏర్పాటు చేశారు. కొన్నాళ్ళు కుట్టు, సంగీతం, హిందీ తరగతులూ నడిపారు. 1949 నుంచి మూడున్నర సంవత్సరాలపాటు గుంటూరు జిల్లాబోర్డు సభ్యత్వ గౌరవమూ పొందారు.

ఇప్పుడు స్త్రీ హితైషిణీ మండలి యువతీ సంక్షిప్త విద్యాలయం నడుపుతున్నది. దీనిలో రెండు సంవత్సరాలపాటు చదువుచెప్పి ఎనిమిదవ తరగతి ప్రభుత్వ పరీక్షలకు పంపుతున్నారు. విద్యాలయానికి స్వంత వసతిగృహంఉంది. ప్రభుత్వం ఐదువేల రూపాయల గ్రాంటు ఇస్తున్నది. స్వర్గీయ కోపల్లె హనుమంతరావుగారి కుమార్తె కుమారి కమలాదేవిగారు, కుమారి మద్దాలి శ్రీ లక్ష్మిగారు ఉపాధ్యాయినులు. శ్రీమతి కామరాజు వేంకటలక్ష్మమ్మగారు వార్డెన్. ఈ వసతిగృహంలో అన్ని కులాలవారూ, అన్ని మతాలవారు, అన్ని జిల్లాలవారు ఉన్నారు. రెండు సంవత్సరాలపాటు ఉచిత భోజనం, మూడు చీరలు, పుస్తకాలు ఇస్తారు.

"మీరు మహిళాభ్యుదయంకోసం ఎంతో పాటుపడ్డారు. నేటివరకూ కట్నాలు పోలేదు. కులభేదాలు కూలిపోలేదేః" అని అడిగాను. "మేము కట్నాలు పుచ్చుకోవద్దని ఎంతో ప్రబోధం చేశాము; కాని, వ్యర్థమయింది. చదువుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఇప్పటి సంపాదనలపై తలిదండ్రులు ఎంతోకాలం కట్నాలు ఇవ్వడం సాగించలేరు. కొంతకాలానికన్నా ఈ సమస్య తీరుతుందనే నా నమ్మకం" అని ఆమె సమాధాన మిచ్చారు.

శాఖాంతర వివాహాలే జరుగనప్పుడు కులాంతర వివాహాలు జరగడం ఎలాగని ఆమే ఆశ్చర్యం ప్రకటించారు. "వర్ణభేదం, వర్గభేదం అంతటా వుంది. అది కూలిపోవడం కష్టం. వర్ణభేదం మొండిగోడలుగా ఉన్నంతవరకూ సంఘ పరిస్థితులుఇంతే" అని వారి నిరంతర విచారం.

హృదయపూర్వకంగా కాంగ్రెస్‌ను అనుసరించేవారు తక్కువయారని, ప్రజాక్షేమంకోసం పనిచేసేవారూ కొరవడ్డారని వారి ఆవేదన. సంఘం బాగుపడాలంటే మంచి నాయకత్వం ఏర్పడి ప్రజలకు జ్ఞానం కలిగించాలని వారి సూచన.

వారి మాటలు వింటూ ఉంటే, ఉన్నత పర్వతాగ్రంమీదో, సంజమబ్బుల పవడాల ఛాయలలో నదీతీరానో, ఉద్యానవనంలోనో, సముద్రపు అంచులలోనో విహరిస్తున్నట్టు అనిపిస్తుంది. చీదర్లు, చీకట్లు పటాపంచలయినట్టు పరమానందమవుతుంది; పానకం తాగుతూ ఉన్నట్టే ఉంటుంది. గిరీశం అన్నట్టు వారి మాటలు వినడమే ఒక 'ఎజుకేషన్'. వారి సాంగత్యం ఒక మత్తు. విడిచి రాబుద్ధిపుట్టదు అదేదో అద్భుత వశీకరణ శక్తి! కొంపలు మునిగి పోతున్నా, వదల మనసురాదు. అదేదో అసదృశమైన మాగ్నటిజం!

వచనంలోను కవిత్వం ఉంటుందా-అన్నది ఒకప్పుడు వివాదాంశం. 'గద్యం కవీనాం నికషం వదంతి' అని దండ్యాచార్యులు మొదలయిన అలంకారికులు చెప్పినా సందేహం సమసిపోలేదు. కాని, దేవులపల్లివారి మామూలు పలకరింపులలోను కవిత్వం చిప్పిలితూ ఉంటుంది. మనను వారు ఏ వయోవృద్ధునికో 'వీరు ఫలానా' అని పరిచయం చేస్తారనుకోండి. "కంటిచూపు తగ్గింది బాబూ, చెబితేగాని తెలీదు నాయనా" అని ఆ వృద్ధు అంటారు. దానికి దేవులపల్లివారు "మీరు ఎంతో అదృష్టవంతులు. చెబితే తెలుస్తున్నది. చెప్పినా తెనియనివారు ఎందరున్నారో భారతదేశంలో!" అంటారు వెంటనే. మనకు నవ్వు ఆగదు. ఇలా అను నిమేషం వారి వాక్కులలో చిల్లర విషయాలూ చమత్కారంతో కవితగా కనవస్తాయి, వినవస్తాయి. అందువల్లనే కాటూరి వేంకటేశ్వరరావుగారు తరచు అనేవారు "మా కృష్ణశాస్త్రి మామూలు మాటలలోనే కవిత్వం ఉంటుంది. చాలమంది వాటితోనే తృప్తిపడిపోతారు. ఆయన కవిత్వం చెప్పదలచుకుంటే, అంతకన్నా పై స్థాయి ఉండాలి. అందువల్లనే ఆయన హెచ్చుగా వ్రాయలేకపోయాడు" అని.

గుణంకన్నా గుణానికి, రాశికన్నా వాశికి ప్రాధాన్యమిచ్చే దేవులపల్లివారు 1897 లో తూర్పు గోదావరిజిల్లా చందనంపాలెంలో జన్మించారు. ఈ గ్రామం కూచిమంచి తిమ్మకవి నివసించింది. దేవులపల్లివారి పూర్వులది ఆకిరిపల్లి, తాతగారు వలస వచ్చారు. తండ్రిగారి దాక పండితులు కానివారుగాని, రామభక్తులు కానివారుగానిలేరు. కనుకనే "దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి" అని చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారూ ప్రశంసించారు. దేవులపల్లివారి జనకులు వేంకటకృష్ణశాస్త్రిగారు కూచిమంచి తిమ్మకవి మునిమనమడు వేంకట్రాయమంత్రివద్ద కవిత్వపు మెలకువలు తెలుసుకున్నారు. వారూ, పెత్తండ్రి సుబ్బారాయశాస్త్రిగారూ పీఠికాపురాస్థాన విద్వత్కవులు. కనుక దేవులపల్లి వారికి పుట్టుకతోనే గొప్ప సంస్కారం అబ్బింది. తండ్రిగారు, పెత్తండ్రిగారు చిన్నప్పుడు పద్యాలువ్రాసి వినిపించి "ఏది బాగుంది?" అని అడిగేవారట. వ్యస్తాక్షరి చేయించేవారట. అప్పటినుంచే దేవులపల్లివారికి పదాల సంగీతం తెలిసింది; ఏది మధురమో తెలిసికొనే జ్ఞానమూ కలిగింది. ఈ సంగీత సంగతితోనే వారు ఏడవ ఏటే సామర్లకోటలో "నంద వందన ఇందిరానాథ వరద" అని తొలిసారిగా పద్యం

చెప్పారు. తర్వాత పదవ ఏట రామతీర్థంలో కవిత చెప్పారు. కాని, దురదృష్టవశాత్తు వారికి తమతండ్రి పెత్తండ్రిగార్లవద్ద బహుకాలం శిక్షణపొందే అవకాశం లేకపోయింది. పెత్తండ్రిగారు 1909 లోను, తండ్రిగారు తర్వాత రెండేండ్లకు కాలధర్మం చెందారు. కాని దేవులపల్లివారు వారి రచనలను పారాయణంచేశారు. "నా కవితలో నాన్నగారి లిరికల్ ఫెర్వర్, పెదనాన్నగారి జిగీవచ్చాయి" అంటారు వారు.

వారి విద్యార్థిదశ పిఠాపురంలోను, కాకినాడలోను గడిచింది. పిఠాపురం హైస్కూలులో హెడ్మాస్టరు కూచి నరసింహంగారు. కాకినాడ కళాశాలలో రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు, రామానుజాచార్యులుగారు వారిని తీర్చిదిద్దారు. "చిన్న తనంలో కూచి నరసింహంగారు, తర్వాత నాయుడుగారు నాకు ఆంగ్ల సాహిత్యంలో అభిరుచి కలిగించారు" అని వారు తరచు భక్తితో అంటారు. అంతేకాదు. "సరకు నాన్నగారు ఇచ్చారు. ఆధునిక యుగధర్మానికి అనుగుణంగా కిటికీలు తెరిచి, క్రొత్త చూపు ప్రసాదించినవారు వేంకటరత్నంనాయుడుగారు. సారస్వత ప్రియత్వమే కాక లోకమంతటినీ ఆప్యాయంగా ఆలింగనం చేసుకొనే అనురాగబంధం ఆయన శిష్యత్వం వల్ల లభ్యమయింది; జీవితంలోని ప్రతి అల్పానుభవాన్ని ఒక ఉదాత్తదృష్టితో అనుభవించే శక్తి ఆయనవల్ల కలిగింది" అంటారు వారు

దేవులపల్లివారు 1918 లో పట్టభద్రులై జీవితంలో అడుగుపెట్టే వేళకు బ్రహ్మసమాజోద్యమం, వ్యవహార భాషావాదం తీవ్రంగా ఉన్నాయి. వాటితో వారు ప్రభావితులయారు. రెండేండ్లపాటు కాకినాడ, పెద్దాపురం మిషన్ హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ, "ధర్మసాధని" అన్న పత్రికలో పిఠాపురం రాజాగారికి వ్యతిరేకంగా వ్యాసాలు వ్రాశారు వాటిఫలితం కోటనుంచి వచ్చే వార్షికం అపివేత. ఆ సమయంలోనే సతీవియోగం సంభవించింది. వారి కరుణాంతరంగం కరిగి 'కన్నీరు' ఖండకావ్యంగా తరంగితమయింది. ఇదే వారి తొలి ఖండకావ్య సంపుటి (1923). తర్వాత ద్వితీయ వివాహమై పిఠాపురం హైస్కూలులో నౌకరీ దొరికింది. కాని, అది కొన్ని నెలలపాటే. వారి భావాలు రాజాగారికి నచ్చనందున పనిమాని, పది సంవత్సరాలపాటు దేశమంతా తిరిగారు. మళ్ళీ 1933 నుంచి పదేళ్ళపాటు కాకినాడ కళాశాలలో ఉపాధ్యాయులుగా ఉన్నారు.

దేశం తిరిగిన పది సంవత్సరాలూ వారి జిజ్ఞాసకు, కవితకూ పరువం. వారికి హరీంద్రనాథ చట్టోపాధ్యాయుడు, సాహితీసమితి సభాపతి శ్రీ శివశంకరులు వంటి విద్వత్కవివతంసులతో ఆత్మీయత కలిగింది. శాంతినికేతనంలో పలువురు సాహిత్య బంధువులయారు. వారు ప్రాచ్య పాశ్చాత్యకవుల రచనలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. 'ఏకోరసః కరుణ ఏవ' అన్న భవభూతివాదం ప్రియమైనది. రొమాంటిక్ ఉద్యమ ప్రవాహం వారిని ముంచెత్తింది. ప్రాచీనుల సంప్రదాయానికి సమకాలిక జీవితం మేళవించారు.

"ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేతరెమ్మనై
ఈ అడవి దాగిపోనా, ఎట్లైన
నిచటనే యాగిపోనా?"

అంటూ గొంతు విప్పారు. కరుణ విప్రలంభాలు కరవైన తెనుగులో ఆరని దివ్వెలు వెలిగించారు. ఔను మరి! "కలికిపాటల కోయిలకులము" వారిది. విలక్షణత వారి సొమ్ము. 'కృష్ణపక్షము'తో (1925) తెనుగులో కన్నీటికెరటాల వెన్నెలల మహోజ్జ్వల పక్షమే స్థాపించారు. "ఊర్వశి"తో (1928) తెనుగుకు నూతన శ్రీవిలాస హాసాలు అందించి, నూత్నకల్యాణతూర్య మనోజ్ఞ గాన నృత్య కోలాహలం చెలరేగించారు. అప్పుడు వారు హరిజనసేవలో నిమగ్నులయి ఉండేవారు. కరుణరసం వారికి మానవాకించనత్వాన్ని కనులగట్టించి,

"కురియుమురా కన్నీటిని
మరిమరి విలపింపుమురా"

అంటూ భక్తి కీర్తనల రూపంలో ప్రవహించింది. వారి దారుణ దురంత హృదయావేదన ఈ కీర్తనలలో కట్టలు తెంచుకుంది. విన్నవారికి ఉప్పెనవలె ఆవేదన పొంగి వస్తుంది. వాటిని ఇతర మతాలవారూ కొంచెం మార్పులతో పాడుకుంటున్నారంటే వాటి ప్రాచుర్యం ఏమనాలి?

1942 నుంచి వారు చెన్నపురిలో ఉంటూ మల్లీశ్వరి మొదలయిన సినిమాలకు మాటలు, పాటలు వ్రాశారు. రేడియో ప్రసారంకోసం క్షీరసాగర మథనం, విప్రనారాయణ చరిత్ర, మాళవికాగ్నిమిత్రం యక్షగానాలు, రామానుజ కథ, ముఖలింగం, శివకవికథ, ప్రసన్న పారిజాతం, సాయుజ్యం మొదలయిన భక్తినాటికలు, విద్యాపతి కార్తికి, కృష్ణాష్టమి మొదలయిన లిరికల్ నాటికలు వ్రాశారు. హైదరాబాదు రేడియోలో ప్రయోక్తగా చేరిన తర్వాత, 'ఏడాది పొడుగునా' అనే నాటకంలో సంవత్సర గ్రామజీవితం చిత్రించారు. 'ఋతుచక్రం'లో "చౌరాస్తా ఆహిస్తా" అంటూ నగర శ్రమజీవుల జీవితం వర్ణించారు. ఇటీవల వారు రచించిన 'కొత్తకోవెల' (గాంధీ సమాధి) 'ఆండాళ్' నాటికలు అసదృశమైనవి.

"తన కంఠమున దాచి హాలాహలం
తలనుంచి కురిపించి గంగాధరం
మనిషి శివుడవడమే గాంధీవరం
బాపు ననుసరిస్తె చాలు మనమందరం"

అంటారు కొత్తకోవెలలో.

"నవ్వంటే జాబిల్లి
పువ్వంటే మల్లి
నవ్వేటి పూవంటె
నా చిట్టి తల్లి"

అంటూ పిల్లల పాటలు మొదలు దంపుళ్ళపాటలు, అమ్మలక్కల పాటలు, ఆకలి పాటలు—అనంతంగా వ్రాశారు. "నేనేదో భక్తకవిని కాను. మీరనుకునేంత భక్తుణ్ని కాను. కొందరు అనుకునేంత దుర్మార్గుణ్నీకాను. ఎప్పుడో హృదయావేదన భరించ నప్పుడుకేక పెడతాను. అది కీర్తన అవుతుంది" అన్న వారి మాటలు ఎంత హాయి!

వారి రేడియో ప్రసంగాలలో మలుపు తిరిగితే, రిక్షావాలా; బూట్‌పాలిష్ వంటివి సాహిత్యదృష్టిలోను ఉత్తమమైనవి.

దేవులపల్లివారు ఏది రచించినా, ప్రతిపదానికి రంగూ, రుచీ, వాసనా ఉన్న వన్న సూక్ష్మపరిశీలనతో, శిరీష కుసుమకోమల పదాలలో హరజటా పారిజాత లతాంత మధుపేశల భావాలు మలచి, వేయి కన్నులతో వీక్షించి, స్వాదు సంగీత కలనా లసద్విపంచిమీద మ్రోయించారు.

వారి పద్యాలు చదువుతున్నా, వింటున్నా "నాకు కవిత్వం పుట్టలోని పాము లాగ, తెల్లవారి తలుపులు తట్టి వచ్చిపడే అతిథిలాగ, రేకులు విచ్చుతున్న పూవులాగ రకరకాలుగా వస్తుంది" అన్న వారి మాటల సత్యం గోచరిస్తుంది.

"మీరు ఏదీ మహాప్రబంధ నిర్మాణానికి ఇతిహాస రచనకూ పూనుకోలేదేం?" అని ప్రశ్నిస్తామనుకోండి. "రామాయణం మానవ రచితమైన గొప్ప ఇతిహాసం; కల కాలానికి వర్తించేది. కాళిదాసు కవిత కవితాగుణాలన్నీ పుంజీభూతమైంది. పాతవారికి అంతా సత్యం. రామాయణం ఇప్పుడు ఎవరైనా వ్రాస్తే, నప్పదు. నన్నయ, తిక్కన మానవుల లోతులు, ఎత్తులు సులభంగా తెలిపారు" అని వారి సమాధానం.

"కవికి నిజాయితీ ఉండాలి. ప్రేమ ఉండాలి మానవత ప్లస్ నిజాయితీ అన్న మాట. కవులు రెండు రకాలవారు, తాము చెప్పదలచింది నిజాయితీతో చెప్పేవారు. వారిది కొంతకాలం నిలుస్తుంది. కాలానుగుణమైన సత్యాన్ని — యుగధర్మాన్ని నిర్వచించేవారు రెండవవారు. వారిది శాశ్వతంగా ఉంటుంది మానవత అంటే విభేదా లకు అతీతమైన రసాస్వాదనం. ఈ దృష్టితో కవులందరూ విశిష్టాద్వైతులు. ఆధునిక యుగంలో రెండు ఉద్యమాలు బయలుదేరాయి. ఒకటి మానవోద్యమం, మరొకటి హిందూ ధర్మ పునరుద్ధరణోద్యమం. మొదటి దానికి ప్రవర్తకుడు రామమోహన్‌రాయ్. నేను మానవోద్యమానికి చెందినవాణ్ని. నా మానవతావాదానికి ఆచార్యులు నాయుడు గారు. నాకు ఆయన విశ్వమానవ దృష్టి ఇచ్చారు" అంటారు వారు.

కనుక నే వారు కవిత్వంలోను జాతులు, మతాలు చూస్తే వెర్రెత్తిపోతారు. విశ్వ

మానవ భావన లేనివాడు గొప్పకవి ఎలా అవుతాడని వారి ప్రశ్న. పరమత సహనం వేరు; ఎక్కడ ఏ మంచిఉన్నా తనది చేసుకొనడం వేరు. ఈ దృష్టితో వారు మతాన్ని గాని, ధర్మాన్నిగాని సులభంగా కవితలో ఒంటబట్టించుకున్నారు. అందువల్లనే వారు "నేను హృదయవాదిని. నాకు వేదాంతం తర్కం తలకెక్కవు. నన్ను ఎడారిలో కూర్చోబెట్టి వేయి పుస్తకాలు ఇస్తామన్నా వద్దు. ఒక్క పుస్తకమూ అక్కరలేదు. పనికి మాలినవారు, చెడ్డవారు, వికారరూపులు అయినా సరే — జనం మధ్యన నన్ను పడేయండి. నేను ఆరోగ్యంతో ఎంతకాలమైనా బ్రతుకుతాను. మనుష్యులు లేకపోతే కాయిలా పడుతాను" అని ఎన్నోసార్లు అన్నారు.

మనమింకా నాటకాల ప్రాంగణంలోనే ఉన్నామన్నది వారి నమ్మకం. "జాతి వయస్సులో ఉన్నప్పుడు టాగూరులాంటివారు పుట్టారు. సంఘదృష్టి కలిగితే మంచి నాటకం, మంచి సాహిత్యవిమర్శ వస్తాయి. కవిత చాల ఆత్మాశ్రయం. వయస్సులో వచ్చేది. పెరిగాక నాటకకర్త అవుతాడు నాటకకర్త ఇంటి యజమాని వంటివాడు" అని వారి వివరణ.

వారి బాహ్య వ్యక్తిత్వంలాగే వారి వక్తృత్వంకూడా విశిష్టం. కవితను, వ్యక్తిత్వాన్ని అనుకరించినట్టే దానినీ పలువురు అనుకరించి కృతార్థులు కాలేకపోయారు. షష్టిపూర్తి దాటి ఆరేండ్లయినా నూనూగుమీసాలు, ముసిముసి నవ్వులు, ఉంగరాల జుట్టు, దుస్సహదురంత వేదనలున్నా మనవికారాలను గరళకంఠునిలాగ దిగమింగుకోవాలి కాని ఏడుపు ముఖంపెట్టి వికారరూపంతో ఉండడం సంఘద్రోహచర్య అన్న సిద్ధాంతంతో పసందైన వేషం, మాటలో, చేతలో, భావనలో, ఇంటా, వంటా శుచీ, సౌందర్యం తొణికిసలాడే వారి వ్యక్తిత్వం అనుకరించడం సాధ్యమా? మిత్రులు కనబడితే వదలలేని ఆప్యాయతచూపే వారి చేతులు అనుకరించడం సాధ్యమా?

ప్రస్తుతం వారు వేంకటరత్నంనాయుడుగారి చరిత్ర వ్రాస్తున్నారు "బ్రహ్మర్షి మాట" మకుటంతో నాయుడుగారి సుభాషితాలు గుదిగుచ్చి, వారు పరమపదించినప్పుడు

"ఈ జడ జీవితమ్ము, పలి
కించితి, నే యమపంకమందు నం
భోజము మొల్వజేసితి, వ
పూర్వము నీ దయ యీ సిరీథి నీ
రాజన మెత్తినావు విపు
లమ్మగు నీ యెద నిండెనే శర
ద్రాజిత చంద్రకాంతు లన్చు
తమ్ములు స్వర్గలతాంత వాసనల్"

అని వాపోయిన దేవులపల్లివారు వ్రాసే ఈ చరిత్ర తెనుగుకు వెన్నెల నివాళిగానే ఉంటుంది. తమ అనుభవాలు—జ్ఞాపకాలు వ్రాయదలచారు. వారికి రకరకాల మనుష్యులతో సంబంధం ఉంది. అవీ తళుకు బంగరు తారలుగానే తెనుగు ఆకసాన్ని అలంకరిస్తాయి. నాయుడుగారి శిష్యరికంవల్ల వారికి సమయపాలన అబ్బలేదనేది పలువురి ఫిర్యాదు. కాని, వారిప్పుడు చేతికి గడియారం కట్టారు. తప్పక మాట నిలబెట్టుకుంటారు. దేనినైనా చిత్రికపట్టే స్వభావం గనుక కొంత విలంబనను సహిద్దాము.

"నాది చిక్కని కవిత అని నా నమ్మకం. అన్ని వర్గాల పరిశీలనా ఉంది" అన్నారు వారు. ఎంత వద్దనుకున్నా కాళిదాస భవభూతుల, యామున వేదాంతదేశికుల తిక్కన పెద్దనల, కబీరు సూరదాసుల, షెల్లీ బైరనుల వరుసలో నిలబడే దేవులపల్లి వారికి అంతమాత్రం అనుకోడానికి అవకాశం ఇద్దాము. రాచవీటిలో పెరిగి జీవితంలోను, కవితలోను అబ్బిన రాజసాన్ని గౌరవిద్దాము.

"వారు వ్రాసింది ఎంత ?" అన్నది బాలిశుల ప్రశ్న. "అమరుక కవేః ఏకః శ్లోకః ప్రబంధ శతాయతే" అన్నాడు ఒక సహృదయుడు అది నాడూ, నేడూ నిజం. దేవులపల్లివారి "ఏకం పద్యం ప్రబంధ శతాయతే" అంటాను నేను. ఇది నేడూ, రేపూ నిజం. సాహిత్య చరిత్రకారులు ఏమి వ్రాతలు వ్రాసినా, నేనుమాత్రం దేవులపల్లి వారిని నవ్యకవితా ప్రస్థానాచార్యులుగా పురస్కరిస్తాను.

"నవ్వివోదురుగాక నాకేటి సిగ్గు ?
నా యిచ్చయే గాక నాకేటి వెరపు ?"






# శ్రీ దేవులపల్లి రామానుజరావు

ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. రెండు చెక్కలుగాఉన్న తెలుగునాడు ఏకీకరణకు ఉద్యమం ఉధృతంగా సాగుతున్నది. రామాయణంలో పిడకల వేటలాగ కేంద్ర ప్రభుత్వందృష్టి ఉస్మానియా విశ్వవిద్యాలయంపై పడింది. ఆ విద్యాలయంలో బోధన భాష ఉరుదూకావడం, అక్కడి పారిభాషిక పద రచనా శాఖ అద్వితీయంగా ఉండటం ఢిల్లీవారి నోట నీరూరేట్టుచేశాయి. ఫారశీలిపిని దేవనాగరలిపిగా మార్చి, ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా పరకాయం చేయడానికి పూనాకున్నారు. తెలుగునాట, ముఖ్యంగా తెలంగాణా ఆందోళన చెలరేగింది. భాషాప్రయుక్త రాష్ట్రాలతో మాతృభాషకు ఏమో ఒరుగుతుందని ఆశిస్తే, ఉన్నసంస్థే చేయిజారిపోతున్నదేమని, ప్రముఖ పౌరులతో ప్రతిఘటన సంఘం (సిటిజన్స్ కమిటీ) ఏర్పడింది. దాని సమావేశకర్తను అంతకుముందు చూడనివారు, తొలిసారిగా చూచినవారూ ముక్కుమీద వేలు పెట్టుకున్నారు; ఎవరు ఈ వామనుడు, ఏమిటి ఈ పైజమా-షేర్వాణీవేషం ఆకాశం చూస్తూ ఐమూలగా అంగలువేసే ఈ నడకేమిటి-అని. కాని ఆయన ఆకారంలో వామనుడైనా తెలివితేటలలో, వ్యవస్థాపన పాటవంలో త్రివిక్రముడని తెలిసినవారు మాత్రం ఉద్యమం సఫలంకాక తప్పదని ఎప్పుడో నిర్ణయించుకున్నారు. వారి నిర్ణయం నిజమయింది.

ఔనుమరి అంతకుముందు ఆరేళ్ళుగా హైదరాబాదు సారస్వత పరిషత్తు కార్య భారం వహించి, తెలంగాణలోను ఇతరత్రాను ఉన్న మారుమూల పల్లెలకూ కాళ్ళు అరిగేలాగ తిరిగి, సారస్వతోద్యమం వ్యాపింపజేసి, రాజధాని నగరం నట్టనడుమన దానికొక సువిశాలమైన స్థలం సంపాదించి, తలయెత్తి చూడదగిన సర్వాంగ సుందర మైన భవనాన్ని నిర్మింపజేసి, తెలుగువారు తలయెత్తుకొనేట్టు చేసిన నిర్మాణదక్షుడు ఆయన. ఆంధ్ర రాజధానిలో ఆయనను చూడనివారు, చూచి గుర్తించనివారు ఉండరు. ఆయన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ఓరుగల్లు పట్టణంలో 1917 ఆగస్టు 24న జన్మించారు. మెట్రిక్యులేషన్‌వరకు హనుమకొండలో చదివారు. తరువాత హైదరా బాదులోని నిజాంకాలేజీలో 1939 లో పట్టభద్రులయారు. సంపన్నకుటుంబం. జీవితంలో కష్టాలేవీ ఎదుర్కోవలసిన అవసరం కలుగలేదు. డొక్కకోసం రెక్కలు ఆడించవలసిన దుర్గతి అసలే లేదు. కనుక బి ఏ పట్టా పుచ్చుకున్న తరువాత రెండేళ్ళపాటు గ్రంథాలయోద్యమంలోను మరిరెండేళ్ళపాటుయువజన కాంగ్రెసులోను పాల్గొన్నారు. ఆ సమయంలో ప్రజాసేవకులందరికీ కలిగినట్లే వీరికి న్యాయవాది కావా లనే కోరిక కలిగింది. నాగపూర్ వెళ్ళి ఎల్. ఎల్. బి.తరగతిలోచేరి ఉత్తీరులయారు. తిరిగివచ్చి వకాలతీ ప్రారంభించారు.

అప్పుడు హైదరాబాదు రాష్ట్ర రాజకీయ వాతావరణం భయానకంగా ఉంది. అజాద్ హైదరాబాదు నినాదాలు విజృంభించాయి. వాటికితోడు రజాకార్ల హాహా రవాలు, దేవులపల్లివారి తెలుగుతనం పరవళ్ళు తొక్కింది. ఈ అభివృద్ధి నిరోధకులను ప్రతిఘటించడానికి గొంతువిప్పాలి. దానికి తాము నడుపుతున్న "శోభ" సారస్వత మాసపత్రిక చాలదు అనుకున్నారు. "నాకు న్యాయవాదవృత్తే చాలఇష్టం. గొప్ప న్యాయవాది కావాలనే మొదటినుంచి ఆశ. కాని వెర్రితలలు వేసిన ఉద్యమాలను ఎదు ర్కొనడం విద్యుక్తధర్మం. నా భావాల ప్రకటనకు దారి చూస్తుండగా గోలకొండ పత్రిక దినపత్రిక అయింది. దాని సంపాదకుడుగా నా వ్రాతలకు 'కూతల' కు ధారా ళంగా అవకాశం దొరికింది. ఈ కారణంగానే నేను ఒక ఉద్యమంనుంచి మరొక ఉద్య మానికి శాఖా చంక్రమణం చేయడం సంభవించింది. నా జీవితం ఈ విధంగానే గడచి పోతోంది అన్నారు దేవులపల్లివారు.

గోలకొండ పత్రిక సంపాదకత్వం 1947 నుంచి నాలుగేండ్లవరకే సాగింది. 1948 డిసెంబరునుంచి సారస్వత పరిషత్తుతో సంబంధం కలిగింది. 1952-53 లో దానికి అధ్యక్షులుగాను ఇప్పటి వరకు ఉపాధ్యక్షులుగాను ఉన్నారు. తర్వాత, తర్వాత ఆ సంస్థ భవనాలులేచాయి. "నాతో ఎవరికి విరోధంలేదు. నా పనులు ఎంతో సవ్యంగా సాగిపోయాయి నరోత్తమరెడ్డి, పునిజాల హనుమంతరావు; గడియారం రామకృష్ణశర్మ

నా పనులకు ఎంతో తోడ్పడ్డారు. మేము నలుగురము కలసే పనిచేసాము" అన్నారు వారు.

ఏ పని ఫలమైనా కర్త, కారయిత మొదలయిన ఆరుగురికి చెందుతుందని అభియుక్తోక్తి, కాని కర్త కంటే కారయితకే ప్రాధాన్యత హెచ్చుగా ఇవ్వాలని నా అభిప్రాయం. ఏ పనైనా చేయడంకన్న చేయించడం కష్టం. తను ఏదో తనకు నచ్చింది చేయడం సులువు. తన ఇష్టానిష్టాలు తగ్గించుకుని, పదుగురితో పనిచేయడం కష్టం. పదుగురితో పనిచేయించడం మరీకష్టం. ఆ విధంగా ఇతరులతో పని చేయించినవారే మొదటినుంచి గొప్పవారయ్యారు. గొప్పపనులు సాధించారు. కొందరు తమ మేధతోను సౌజన్యంతోను పదుగురునీ ఆకట్టుకోగా కొందరు అధికారంతోను. ఈవితీను ఆకట్టుకుంటారు. మేధ సౌజన్యం లేకపోతే విద్యారణ్యుల వారు వేదభాష్యమనే మహాధ్వరాన్ని ముగించే వారేకాదు.

ఏ తావతా :

వ్యవస్థాపన శక్తికి కలసికట్టుతనం కన్నతల్లి. దానికి దేవులపల్లివారు పుట్టినిల్లు. ఆ శక్తి మరొక శక్తితో కలసి ఉండకపోతే రాణించదు. దానికి వారి రచనాశక్తి తోడయి వన్నెతెచ్చింది. దానికి సహకారిణి వారి ప్రసంగచాతురి. ఎవరినీ నొప్పించక గంటల తరబడి విషయైక దృష్టితో మాట్లాడగలరు. వాటన్నిటి ఫలితాలే నవ్యకవితానీరాజనము, సారస్వత నవనీతము, నవనీతము, వ్యాసమంజూషవంటి సాహిత్యమిమర్శ గ్రంథాలు; మనదేశము, ఆదిమవాసులు, తెనుగుదేశము, జవహర్‌లాల్ నెహ్రూ; గౌతమబుద్ధుడు వంటి బాలసారస్వతము, పచ్చతోరణమువంటి పద్యకావ్యాలు; తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనమువంటి సాంస్కృతిక గ్రంథాలూను. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన వెంటనే "తెలంగాణములేని ఆంధ్రరాష్ట్రము అసమగ్రము. ఆంధ్రజ్యోతి సర్వతోముఖాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని ఆంధ్రనాయకులు-ఏ ప్రాంతము వారైనను-బద్ధకంకణులై కృషిచేసి ఆంధ్రరాష్ట్రమును సమగ్రముగావించ విశాలాంధ్ర సాధనకు దీక్ష వహించవలసియున్నది. అని ఘోషించిన తొలిబంతి వారితో వారొకరు. దానికోసమే వారు అయ్యదేవర కాళేశ్వరరావు మొదలయిన పెద్దలతో కలసి విశాలాంధ్ర నిర్మాణోద్యము నడిపారు. 'హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమము, విశాలాంధ్ర రాష్ట్రము' అన్న గ్రంథాలు రాశారు. కార్యసిద్ధి తరువాత 'విశాలాంధ్ర' వచ్చింది అనే పుస్తకం వ్రాశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం బదిలీ ప్రతిఘటనోద్యమం ఫలితం మొదటే తెలిపాను.

వారితో సంబంధంలేని సారస్వత సంఘమంటూ విద్యాసంస్థఅంటూ రాష్ట్రంలో లేదు. కొంతకాలం ఉస్మానియా విశ్వవిద్యాలయం సెనెట్‌లోను, రాష్ట్రప్రభుత్వ విద్యా సలహా సంఘంలోను, కేంద్ర పాఠ్యపుస్తక సంఘంలోను, ఆల్ ఇండియా రేడియో సలహాసంఘంలోను సభ్యులు. టాగూరు శతవార్షిక జయంతి సంపుటి కార్య

దర్శులు, గురజాడ శతవార్షిక జయంతి సంపుటి సంపాదకులు. అయినప్పుడు, వారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఏర్పడినప్పటినుండి కార్యదర్శి పదవి అలంకరించడం కేంద్రసాహిత్య అకాడెమి కౌన్సిలు సభ్యులుకావడం, సాహిత్య ప్రతినిధులుగా రాజ్య సభలో ఆసీనులు కావడం ఆశ్చర్యంకాదు.

ఏ ఉద్యమానికన్నా సహకారమే మూలమయినప్పుడు, వారు సహకారోద్య మంలో పాల్గొనడం సహజాతి సహజం. వారు కో-ఆపరేటివ్ జనరల్ ఇన్స్యూరెన్స్ సొసైటీ డైరెక్టర్ల బోర్డు సభ్యులుకూడా.

"నాకు ప్రాచీన సాహిత్యంలో భారతం, భాగవతం ఇష్టమైనవి. నవీనులలో, గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, దువ్వూరి, జాషువ, దాశరథి చాల ఇష్ట మైనవారు. తెలుగు సాహిత్యంలోని వెలుగులను హిందుస్తానీ వారికి తెలుపడానికి ఉరు దూలో తెలుగు సాహిత్యచరిత్ర ప్రచురించాను. హాలీ, గాలిబ్, వచనకారుడు మౌలానా షిబ్లీ నాకు చాల సన్నిహితులు. జాతీయోద్యమానికి సంబంధించినంత వరకు హాలీ రచ నలను తెలుగులో ప్రచురించాను"; అనివారు అంటూ రంజకంగా ఎంతసేపైనా సంభా షిస్తారు.

"ప్రాచీన సంస్కృతిలోని ఉదాత్తతను కాలానుగుణంగా మలచుకోవాలని ఆ నిగ్గును రక్షించుకోవాలని కోరేవారిలో నేనొకణ్ని. ప్రాచీనతతో సంబంధం ఉండా లనేవాణ్ని. భారతీయ సంస్కృతిలో విశ్వజనీనత ఉంది. దానినే మనం రక్షించుకోవాలి. ఆ విశ్వజనీనతే మన సంస్కృతిని శాశ్వతం చేస్తున్నది" అని వారి విశ్వాసం.

వారు తెల్లవారు జామున నాలుగున్నరకే లేచి, స్నానాదులు ముగించుకుని, ఆరు న్నరనుంచి ఎనిమిదిన్నర వరకు ముఖ్యమైన వ్రాతపనులు చూచుకుంటారు. తర్వాత సారస్వత పరిషత్తు కార్యాలయానికి వచ్చి, పరిషత్తు, సాహిత్య అకాడెమీల పనులు చేస్తారు. పన్నెండు గంటలకు ఇంటికివెళ్ళి భోజనం ముగించి, గంటన్నర విశ్రమిస్తారు. సాయంకాలం నాలుగున్నరనుంచి పరిషత్తు కార్యాలయంలో మరల కార్యక్రమం ప్రారంభం. సాయంకాలం ఆరుగంటలకు వాహ్యాళికి బయలుదేరుతారు. వారికి బ్రిడ్జి ఇష్టం. ఇప్పుడులేదు. షేర్వానీ, పైజామా నచ్చిన దుస్తులు.

వారికి తోటపని చాల ఇష్టం. "నాకు బాదరబందీ ఏమీలేదు. నా కుమారుడు ఎదిగి వస్తున్నాడు. నాకు ఏ జంజాటమూ ఇక ఉండదు. ఆఖరుకు వరంగల్లులో స్థిర పడి, తోటపని చేసుకుందామని ఉంది" అని వారు అంటున్నప్పుడు ఎన్నో ఉద్యమా లకు, సంస్థలకు నారుపోసి, నీరుపోసి, పెంచి పండించుకున్న దేవులపల్లి వారు తోట లనూ బాగానే పెంచి పండ్లు అనుభవించగల రనడం నిస్సందేహమని అనిపిస్తుంది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడెమీ పక్షాన మంచి తెలుగు నిఘంటువును ఒకటి నిర్మింపజేయాలనీ, సారస్వత పరిషత్తుకొక గొప్ప రిఫరెన్స్ లైబ్రరీ ఏర్పాటుచేయాలనీ వారికి ప్రస్తుతం ఉన్నకోరికలు. ఇన్ని సాధించినవారికి ఇవి ఏపాటివి ?

సృజనాత్మకశక్తి, దానిని మించిన నిర్మాణ దక్షతగల శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు ఈ రెండు కోరికలతోనే సంతృప్తిపడక, తెనుగు సాహిత్యం, తెలుగువారి అభిరుచి దేశంలోని ఇతర భాషలవారికి ఒరవడి అయ్యేటట్టు సారస్వత మహాధ్వరానికి పూనుకుంటారని ఆశిస్తున్నాను.





# శ్రీనాయని సుబ్బారావు

"అన్నా, మా మామ యిదివరకే నాకు కూతు నీయ ననెను. నేను నాలుగేండ్ల నుండి యుద్యమములో జదువు మానిన తరువాత 'దినుటకు దిండి లేదు. వానికి బిల్ల నెవరిత్తు'రని యన్నాడట. పిల్లమాట యెట్లున్నను, స్వరాజ్యము వచ్చునని చదువు మానితిని. వచ్చుననుకొన్న స్వరాజ్యము రాలేదు. రాదనుకొన్న శశి మరీ రానట్లున్నది"

"—కిరీటీ యొయ్యారమైన విలాసమైన పసి సిగ్గు వెల్రిగక్కు చిరునవ్వు బల హీనమైన మొగమున దాండవింపజేసెను. చచ్చిపోవుచున్న తీగ కెరు వుంచి నీరు పోయగా మరునాడు నిలద్రొక్కుకొని మొండివడిన కొమ్మ కణువులో కనబడీ కనబడ నంత సన్నని లేత చివురు కనిపించినట్లున్న దా నవ్వు. రెండు రోజులలో కిరీటిమరల మనిషివలె కనబడజొచ్చెను. శరీరమునందు బలహీనముగానున్నను, కొద్దిగా లేచి తిరుగుటకు నుత్సాహము తనలో గనబడుచుండెను. స్నేహితులందరకును శుభలేఖలు వ్రాయబడినవి. కిరీటి తాను స్వయముగా వ్రాసెను. పెండ్లి బాపట్లలో. వివాహమునకు

బంధువులకన్న స్నేహితులే ఎక్కువమంది వచ్చిరి. కిరీటి ప్రణయకథ స్నేహితు లంద రెరుగుదురు. చివరకు వారి యిద్దరకును బునస్సమాగమము కలుగుచున్న దనుటచే సంతోషించని మిత్రుడు లేడు—"

'వేయి పడగలు'లో ప్రణయ తపస్వి ప్రణయ సిద్ధుడు అయిన ఈ కిరీటి మరె వరోకారు; శ్రీ నాయని సుబ్బారావుగారే.

కవి కేవలం దాగి ఉండి ఏ నాయికా నాయకులతోనో మాట్లాడించడం కాక స్వయంగా తన హృదయాన్ని విప్పి చూపడమనే ఆత్మాశ్రయ కవితా నూతన ప్రవాహంలో ఉవ్వెత్తుగా లేచిన మహాతరంగమైన శ్రీ నాయని వారు నెల్లూరుజిల్లా పొదిలె తాలూకాలో 1899 లో జన్మించారు. వారి నాయనగారు శ్రీ కృష్ణారావుగారు. వెంకటగిరి సంస్థానంలో తాసీల్దారు. పొదిలెలోనే వారి ప్రాథమిక విద్యాభ్యాసం జరిగింది.

నాయనివారికి ముగ్గురు సోదరులు, ముగ్గురు సోదరీమణులు. తండ్రిగారు వారందరినీ చుట్టూ చేర్చుకొని నేర్పుతో కథలు చెప్పేవారు. వారి నాయనమ్మ పర్వతమ్మగారు మహాభక్తురాలు. వారి వెంట నాయనివారు పొదిలె కొండమీది నిర్మమేశ్వరాలయానికి వెళ్ళుతూ, కీర్తనలు, స్తోత్రాలు వినేవారు దానివల్ల నాయనివారికి తెనుగు అన్నా, సత్ప్రవర్తనమన్నా లేలేత హృదయంలోనే నారులు పడ్డాయి.

వారు మేనమామల యింట, ఒంగోలులో ఉంటూ మిడిల్‌స్కూలులో చేరినప్పుడు వారి కవితాభిరుచికి మంచి ప్రోది ఏర్పడింది. అక్కడి ఉపాధ్యాయులు పీసుపాటి వేంకటరంగయ్య, కురుగంటి శ్రీరామశర్మ, అక్కిరాజు నరసింహారావు మొదలయిన వారు ఇతర విషయాలు బోధించేవారయినా, విద్యార్థులతో తెలుగు పద్యాలు చదివించి, తోక పద్యాలు (అంత్యాక్షరి) చెప్పించేవారు. నాయనివారు మిడిల్‌స్కూలునుంచి మిషన్ హైస్కూలులో చేరినప్పుడు, ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిగారు చాల అభిరుచి కలిగించారు.

అప్పుడే తెనుగు పుస్తకాలు కొనడంకూడ వారికి అలవాటయింది. ఒకమారు ఒక పుస్తకం కొనదలచారు. చేతులో పది అణాలే ఉన్నవి. ఎవరూ చూడకుండా అత్తమ్మగారి పోవులపెట్టెలోని చిల్లరడబ్బులు తీసుకుని ఉడాయించారు.

నాయనివారు 1916 లో స్కూలు ఫైనలు తర్వాత ఒక సంవత్సరం ఊరికేనే ఉన్నారు. అప్పుడే అడపా దడపా ఒక ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఆ సంవత్సరమే తొలిసారిగా పద్యాలు చెప్పారు— క్షీరసాగరమథనం పేరుతో. అప్పటికి వారికి ఛందస్సంటే ఏమిటో తెలీదు. గుజిలీ భారతం ప్రతి చతువుతూ ఉండగా, పద్యం రెండవ అక్షరాలన్నీ ఒక్కటిగా ఉండడం కనిపించి ఆశ్చర్యపోయారు. ఆ విషయం తామే కనిపెట్టినంతగా ఆనందించారు.

సంవత్సరం తర్వాత వారు బందరు వెళ్ళి నోబెల్ కళాశాలలో ఏఫ్. ఏ. లో చేరారు. వారికి తెనుగు, సంస్కృతం, లాజిక్ తీసుకుందామని ఉండేది. కాని, అన్న

గారు శ్రీ నాయని నరసింహారావుగారు చరిత్ర తీసుకోమన్నారు. అన్నగారి ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ.

నాయనివారు బి. ఎ. ఆఖరు సంవత్సరంలో ఉన్నారు. దేశంలో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమయింది. కృష్ణా క్లబ్బులో ఉపన్యాసాలు జరిగేవి. జాతీయత ఒంటబట్టింది. సహాధ్యాయులయిన కాటూరి వేంకటేశ్వరరావుగారు డిసెంబర్‌లోనే చదువు మానుకున్నారు. నాయనివారు, కళా వెంకటరావు, పులిగండ్ల వేంకటకృష్ణయ్య (నెల్లూరు), భాగవతుల లక్ష్మినారాయణ మున్నగువారు పరీక్షకు డబ్బుకట్టి మానుకున్నారు. బందరుకు గాంధీజీ విచ్చేశారు. వారికి మౌలానా షౌకతాలీ, మౌలానా మహమ్మదాలీ అంగరక్షకులు. ఆ దృశ్యం చూచిన నాయనివారు పలువురు మిత్రులతో కలిసి మహావేశంతో వెళ్లి ఒక ముస్లిం దుకాణంలో తేనీరు తాగివచ్చి, కళాశాల బోర్డు మీద "వందేమాతరం గీతము పాటింపుడీ" అంటూ వ్రాసి ఒంగోలుకు పయనమయ్యారు.

నాయనివార్ల పరీక్ష మానుకుని తిరిగిరావడం ఒంగోలులో మేనమామగారింట్లో ఎవరికీ ఇష్టంలేదు. నాయనివారు వారి కోరచూపులు, గీరమాటలు తప్పించుకొనడానికి ఒంగోలు కొండమీద విహరించడం ప్రారంభించారు. కొండ అవతల భావిలో ఊత, కొండమీది సుందర ప్రకృతి ఊత — ప్రణయ కవిత ఉప్పెనగా వచ్చింది.

"చెప్పె నత్తమ్మ చేతిలో చేయి వైచి
నీ కుమారున కిచ్చెద నా కుమార్తె
ననుచు మును నాన్న; నేడు పేరాస దగిలి
తోసిరాజనె జేసిన బాస లన్ని"

అంటూ 'వత్సల వలపు'గా రూపొందింది. దానిని వెంటనే 'సాహితి' పత్రికకు పంపారు. (1922) ముద్రితమైంది. అదే నాయనివారి తొలి ముద్రిత రచన.

ఆ రోజులలో ఒంగోలులో ప్రకాశంగారింట్లో జాతీయ పాఠశాల నెలకొల్పబడింది. నాయనివారు ఆ పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. భూగోళశాస్త్రం చెప్పేవారు.

ఏమైనా బి ఎ. ముగించక తప్పలేదు. మరల బందరు వెళ్ళారు. అప్పుడే విశ్వనాథవారితో పరిచయమయింది. విశ్వనాథవారు జాతీయ కళాశాలలో ఉపాధ్యాయులు. వారి సోదరులు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వరులుగారు కృష్ణాపత్రికలో ఉపసంపాదకులు కనుక వారి పరిచయంతో కృష్ణా పత్రికకు తప్పనిసరిగా పద్యాలు వ్రాయడం అలవడింది. కవితా వ్యాసాంగం కొనసాగింది. కాని, మాతృ వియోగం సంభవించింది. తల్లడిల్లిపోయారు. ఆ దుఃఖంలో "మాతృగీతాలు" ఆరంభించారు. మాతృప్రేమ పొర్లిపారని సాహిత్యం ఏ దేశంలోనైనా ఉంటుందా? ఆ సాహిత్యంలో

ఈ గీతాలు మణిపూసలు: అమ్మనుంచి అమ్మలగన్న యమ్మవద్దకు; ముగురమ్మల మూలపుటమ్మ వద్దకు హృదయాన్ని కొనిపోయే కరుణావాహినులు.

మాతృవియోగంతో ఆ ఏడు, మరుసటి సంవత్సరం వివాహంవల్ల పరీక్ష పోయింది. పరీక్షలో ఇంగ్లీషు పరీక్షనాడు తమ ప్రణయ తపఃపరమావధిగా సిద్ధిని పొందినందుకు 'ఫలశ్రుతి'గా—

"అంత శ్రమపడి పావన మత్రభగంగ
ధారుణికి దెచ్చినాడు భగీరథుండు
అంత మధియించి కలశ రత్నాకరమ్ము
అమృత భాండమ్ము పడసినా రమర నరులు"

అన్నపద్యం వ్రాసి తిరిగి వచ్చారు. పద్యం చదివి ప్యాసుచేసే పరీక్షక మహాశయుడు ప్రపంచంలో పుట్టలేదు మరి! నాయనివారు 1925 సెప్టెంబరులో బి. ఎ. పూర్తిచేసి, మరు సంవత్సరం నెల్లూరులో ప్రొబేషనరీ సబ్ రెజిస్ట్రారుగా చేరారు. ఎనిమిది నెలలే ఈ నౌకరీ సాగింది ఈ భావుకులకు. అయిదు గంటలకే ఇంటికి వెళ్లేవారు. దానితో తగాదా వచ్చింది; మానివేశారు. తర్వాత విశ్వవిద్యాలయంలో (విజయవాడలో)లోవర్ డివిజన్ గుమాస్తా గిరితో కొంతకాలం గడిచింది.

ఇంతలో నాయనిగారి కవితా జీవితమూ, జీవితమూ ఒక్క స్థాయిని ప్రస్థానం చేసే గొప్ప సంఘటన జరిగింది. సాహిత్యోపాసకులకు కల్పవృక్షమయిన శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారు నాయనివారి ప్రతిభను గుర్తించి, వారికి నరసారావుపేటలో ఉపాధ్యాయ పదవి కల్పించారు. నాయనివారు అక్కడే ప్రధానోపాధ్యాయులై పదవిని విరమించారు.

నాయనివారు దాదాపు ఒక్కతరం కాల్పనిక కవితను ఆరాధించారు. తక్కిన భావకవులేమో ప్రణయాన్ని తదేకంగా భావించినవారు. నాయనివారు ప్రణయాన్ని దేవీమూర్తిలోని ఒక అంశగా, ఒక కళగా దర్శించారు. తల్లి ఉద్బోధతో వలవులజ్యోతినే కనుగొనడానికి బయలుదేరి, తల్లికొరకే యాత్ర సాగించి; సమగ్ర దేవీమూర్తినీ మాతృభావంతో దర్శించి, ఏకదేశంగా తన ప్రియురాలిలో ప్రణయ భావాన్ని చూచారు. సాటి కవులలో కనిపించనిదీ, వీరిలో కనిపించేదీ విశేషమిదే. వారి సర్వకృతుల సంకలిత సంపుటి "నాయని సుబ్బారావు కృతులు".

వారి పద్యాలు జీవితాన్ని చీల్చుకొనివస్తాయి. చక్కగా చిక్కగా, అతి వేలమైన సంయమంతో. అనంతమైన భావనతో పద్యాలు చికిలీ పెడుతారు. కనుకనే వారికి తిక్కన పదబంధం, తిక్కన మెలకువలు చాల యిష్టం. కేతనదశకుమార చరిత కథాకథనమూ ఇష్టమే. కేతనా తిక్కన పథం వాడేగా!

నాయనివారు 1957 లో హైదరాబాదు చేరారు. ప్రస్తుతం హైదరాబాదు రేడియో కేంద్రంలో రచనా ప్రయోక్తలు. దాదాపు పదహారు రేడియో నాటికలు వ్రాశారు.

వారికీ నలుగురు కుమార్తెలు, ఒక కుమారుడు ఉన్నారు. పెద్ద కుమార్తె శ్రీమతి నాయని కృష్ణకుమారి ఉమెన్స్ కళాశాలలో ఆచార్య. వారి సతీమణి శ్రీమతి హనుమాయమ్మగారు. ఆమే వారి ప్రణయ కవితకు ఆలంబన సదృశయైన వత్సలాదేవి.

నాయనివారు ఉదయం ఆరు గంటలకే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని పద్యాలు ఆలోచించి, చికిలీపెట్టడం తలపోస్తుంటారు. సాయంకాలం వాహ్యాళి వెళ్ళుతారు. వారికి నడక చాల యిష్టం. సహాయ నిరాకరణోద్యమంలో రోజుకు పది పదిహేను మైళ్ళు తిరిగేవారు మరి.

వారు ఆంగ్ల సాహిత్యమూ ఎంతో పఠించారు. కాని ఏ కవిముద్రా వారి హృదయంపై పడలేదు. "కవిత్వానికి నన్ను ప్రేరేపించింది ఘటనలే. ప్రేమ, మాతృ వియోగం, నరసారావుపేటలో పడిన బాధలు, స్వస్థలాన్ని వదలినప్పటి బాధ నన్ను కవిగా చేశాయి. ఆ బాధాఫలమే 'వేదనా వాసుదేవము' అంటారు వారు. ఇప్పుడు తమ చిన్ననాటి అనుభవాలు చెప్పుకునే 'జన్మభూమి', 'కథ కంచికి —?' అన్న ఖండికలో సూచినట్టు "అశరీర వధువు" అన్నకావ్యం వ్రాయగోరుతున్నారు. వారు సంకల్ప సిద్ధులు. కవితామతల్లి ఒడిని నింపుతారు.

ఉపాధ్యాయ వృత్తిలోనే అనుభవం పండి, విజ్ఞానం నిండారినవారు గనుక విద్యారంగంలో వారి అభిప్రాయాలు విలువైనవి. నరసారావుపేట ఉన్నత పాఠశాలలో తెనుగు బోధనభాషగా చేరినవారిలో ప్రముఖులు వారు.

"ఇంగ్లీషు ప్రమాణంతో మనకేమిపని ! ప్రయోజనం? దాని ఉపయోగం ఎంత వరకనేది గ్రహిస్తే చాలు" అంటారు వారు.

"నేడు విద్యార్థులలో విషయగ్రహణం హెచ్చింది. ఇంగ్లీషు ప్రమాణం పడిపోవడం వల్ల నష్టం లేదు. చిన్నప్పుడు మాతృభాష క్షుణ్ణంగా నేర్చుకుంటే ఇతర భాషలు నేర్చుకోవడం సులభం. భాషల మూలసూత్రాలన్నీ సమానమే కనుక మాతృ భాష మూలసూత్రాలు ఒంటబట్టాలి. మూడవఫారందాక తెలుగులోనే చెప్పాలి. తర్వాత మూడేళ్ళలో కళాశాలా ప్రవేశానికి తగినంత ఇంగ్లీషు సునాయాసంగా నేర్పవచ్చు.

"మనం ఎంతో పరిభాషను సంస్కృతం నుంచి తెచ్చుకుంటున్నాము. సంస్కృతంలో విదేశ పరిభాషాపదాలు ఎన్నో చేరాయి. అలాగే మనం పారిభాషిక పదాలను ఇతర భాషలనుంచి స్వీకరించి మలచుకోవచ్చు. దీనివల్ల ఉత్తరోత్తరా, స్వతంత్రంగా ఆలోచించి పరిశోధనలు జరుపడానికి వీలవుతుంది" అంటారు వారు.

మితభాషులు, నివురుగప్పిన నిప్పువంటివారు అయిన నాయనివారు తమ సహజ సుకుమార సౌజన్యంతో ప్రకృతిని ఆరాధిస్తూ, కవితను సేవిస్తూ, తాము తలపెట్టిన రచనలన్నిటినీ పూర్తిచేసి ఆంధ్రావళికి అర్పిస్తారనే విశ్వాసం ఆంధ్ర ప్రజలకుఉన్నది.





# శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

అన్యాయం ఎక్కడ, ఏరూపంలో తలయెత్తినా ఎదిరించే అప్రతిమాన సాహసం మంచి ఏ కొంచెమైనా ముక్తకంఠంతో ముచ్చటించే ఔదార్యం; మిన్ను విరిగి మీద పడినా కర్తవ్యంనుంచి కాసంతయినా కదలని కఠోరదీక్ష; సమస్యలు ఒక్కుమ్మడిగా విరుచుకొని పడినప్పుడు ధర్మదృష్టితో వివేచించి దారిచేసుకొనిపోయే వివేకం; ప్రశంశలకు పొంగిపోక, అభిశంసలను ఆహ్వానించి ఆనందించే ఆత్మగుణం, నమ్మినదానిని నిక్కచ్చిగా చెప్పి, చేసిచూపే నిబ్బరం; తన ఇరుగుపొరుగు వారంతా తనను మించి పోవాలనే తహతహ; దౌష్ట్యశిక్షణకు కలాన్ని కరకు కత్తిగావాడే పరాక్రమం, చేపట్టిన వృత్తిపై అపారగౌరవం కలబోసినట్టు కానవస్తారు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు.

నార్లవారిని తలచుకొన్నప్పుడల్లా నాకు పత్రికా సంపాదకులుగా వారు చూపిన ధైర్యసాహసాలు ఎన్నో అహమహమికతో గుర్తుకువస్తాయి; కమ్యూనిష్టులు కనబడితే కాల్చిచంపు-అన్న ఉత్తర్వులు వీరవిహారం చేస్తున్న గడ్డురోజులవి. నేను ఇంటినుంచి కాలినడకన బయలుదేరాను ఆంధ్రప్రభ కార్యాలయానికి. నార్లవారి నివాసానికి కొంత

దూరంలో ఉన్న బస్సుస్టాపులో పెరోల్‌పై వచ్చిన కమ్యూనిష్టులు శ్రీ కాట్రగడ్డ రాజ గోపాలరావు, శ్రీమతి సూర్యావతీదేవి నిలబడి బస్సుకోసం ప్రతీక్షిస్తున్నారు సూర్యా వతీదేవి చేతిలో ఏదో పొట్లంఉంది. నా దృష్టి దానిమీద పడింది. పొట్లం కట్టిన కాగి తంపై నల్లటి తారు చారలున్నాయి. 'ఏమిటండీ ఇవి ?' అని అడిగాను. వారూ ఆశ్చ ర్యంతో పొట్లంవైపు చూచారు. అది వివాహాలు, వ్యాపార ప్రకటనలు వినా తక్కిన చోటల్లా నిలువునా తారుపూసిన ఆంధ్రప్రభ దినపత్రిక పుట. నాకు ఆశ్చర్యం కలిగింది. జాతీయ పత్రికఐన ఆంధ్రప్రభకు ఇదేమి దుర్గతి! -అని. కారాగారాధికారులు పత్రికను ఈ విధంగా సెన్సారుచేసి తమకు అందిస్తున్నారని వారు వివరించారు. నా ఒళ్లు పుల కించింది. పక్కవీధిలోనే ఉన్న నార్లవారి ఇంటికి వారిని నడిపించాను. వారు కుశల ప్రశ్నల తర్వాత ఆ చారల కాయితాన్ని బల్లపై పరిచారు. నార్లవారి కళ్లు ఆశ్చర్యానం దాలతో మిల మిలలాడాయి. దీనిని ఉన్నపాళంగా బ్లాకుచేసి ప్రకటిద్దాం అంటూ సిగ రెట్టు ముట్టించి, ఆలోచనలోపడ్డారు. అది బ్లాకయింది; మరుసటి సంచికలోనే యథా తథంగా ప్రచురితమయింది, సంపాదకీయంతోసహా. దానిపై ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం దర్యాప్తుజరిపి, భయంకరమైన ఆ సెన్సార్ పద్ధతిని తగ్గించడం కారాగారా నికి వెళ్లే పత్రికలకు తారువాతలు తప్పడం విషయాంతరం.

ఒకమారు వైశ్యులంతా విరుచుకుపడ్డారు "కోమటియుక్తి" అని ఏదో శీర్షిక పెట్టడం చూచి "యుక్తి కోమట్లకేనా, ఇతర కులాల వారికిలేవా ? మీ పత్రికవంటిది కూడా కులాలను ఆక్షేపించడమా ?" అని జాబులవర్షం కురిపించారు; మాననష్టం దావాల బెదరింపులతో నార్లవారు కులాలమీద ఉండే సామెతలను కొన్నిటిని సేకరిం చారు; మరునాడే ఇలాటి సామెతలు ఎప్పుడో కులాల స్వభావాన్ని బట్టి రూపొందినవని కులాల స్వభావాలు, వృత్తులు మారినా, అవి సాహిత్యంలో మిగిలిపోయాయని, వాటిని ప్రయోగించడంలో అంతర్యం భావతీవ్రతను తెలుపడమేకాని, కులాలను కించపర చడం కాదని సంపాదకీయంలో స్పష్టపరచిన తర్వాతగాని, వైశ్యులు శాంతిచలేదు.

'క్విట్ ఇండియా' ఉద్యమంలో జరిగిన దౌర్జన్యకాండకు కలతపడిన గాంధీజీ ఉపవాసం ప్రారంభించారు. దానిని పలువురు పలుతీరులు వ్యాఖ్యచేశారు. కానీ, నార్ల వారు 'ఆత్మసంశోధన' అనే సంపాదకీయంలో 'మహాత్ముల జీవితం సత్యాన్వేషణ, నిరంతర సంఘర్షణ. వారికి శాంతి ఉండదు; సౌఖ్యం ఉండదు; సంతృప్తి ఉండదు. వారి లక్ష్యాలు ఎంత మహోన్నతమైనవో అంత కష్టసాధ్యమైనవి. ......కాంతితో పాటు ఉష్ణాన్ని ప్రసాదించడం సూర్యమండల ధర్మం. కాంతితోపాటు శైత్యాన్ని ప్రసాదించడం చంద్రమండలధర్మం వాటి ధర్మాలను ఎవరు మార్చగలరు? మహా త్ముల నిర్ణయాలు సయితం అట్టివే" (1944 అక్టోబర్ 25) అని ధైర్యంగా సమర్థించి గాంధీజీని అపార్థం చేసుకొన్నవారికి కనువిప్పు కలిగించారు. నార్లవారి కలం బలం అలాటిది. అది ఇరువైపుల పదనుగలది; ఒకవైపు పతితను ఆలోచనా పరాయణుని చేస్తుంది మరొకవైపు గుండెను నిండుగా చేస్తుంది. విశ్వకవి అస్తమించినప్పుడు వారి

సంపాదకీయం "ఒక కోయిల మూగవోయింది, ఒక దీపిక ఆరిపోయింది. ఒక నక్షత్రం రాలిపోయింది. ఒక వటవృక్షం కూలిపోయింది. ఒక సత్యవధికుడు కన్ను మూశాడు. (1945 జనవరి 3) అని అంగలార్చినపుడు కన్నీరు నింపని సహృదయుడు కానరాలేదు. 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని అణచివేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం పడినపాటును విమర్శిస్తూ, భారతీయుల స్వాతంత్ర్య భావన ఎన్నటికీ చావదని ఎప్పటికైనా బ్రిటిష్‌ప్రభుత్వాన్ని దహించక తప్పదని తెగవేసి చెబుతూ వ్రాసిన "అమరజ్వాల" అనే సంపాదకీయం నార్లవారి ధైర్యానికి, పత్రికారచనా పాటవానికి అమరసాక్షిగా ఎన్నికాలాలకైనా నిలుస్తుంది.

నార్లవారికి ఈ గుణాలన్నీ హఠాత్తుగా కలిగినవికావు; చిన్ననాటినుంచే అలవడినట్టివి. ఔను, పూవుపుట్టగనే పరిమళిస్తుందని పెద్దలు అననే అన్నారు. నార్లవారి లేలేతహృదయంపై కొల్లి సత్యనారాయణచౌదరి, చెరకువాడ వెంకటనరసింహం పంతులు వంటి బ్రహ్మసమాజనాయకుల ప్రభావం పడింది. అప్పటినుంచే, విగ్రహారాధనపైన, భోగంమేళాలపైన మనసువిరిగింది. కాకినాడలో విద్యార్థిగా వున్నప్పుడే, వినాయకచవితి ఉత్సవాలలో జరిగే భోగంమేళాలను ప్రతిఘటిస్తూ ఉద్యమం ప్రారంభించారు; ఆ డబ్బుతో గుడ్డలుకొని, చందాలు, అత్యవసరవస్తువులు సేకరించి తుఫాను బాధితులకు ఆర్తులకు పంచిపెట్టేవారు ఈ అలవాటే తర్వాత ఆంధ్రప్రభ సంపాదకులుగా ఉన్నప్పుడు తలఎత్తి, రాయలసీమ క్షామనివారణనిధికి, గోదావరి వరదబాధితుల సహాయనిధికి, తూర్పుగోదావరి తుఫానుబాధితుల సహాయనిధికి ఆంధ్రప్రభ పూనుకొని దాదాపు పదిలక్షలరూపాయలు సేకరించడంలో కృతకృత్యమైంది; ఈ నిధులను రామకృష్ణమఠంవారు సవ్యంగా వినియోగించారు. జాతీయ భావాలుకలవారు కనుక విద్యార్థిదశలోనే, అధికారుల దౌర్జన్యాలపైకినిసి విప్లవవాదులతో చేయికలపడం 1927 లోనే మద్రాసు కాంగ్రెస్ మహాసభలలో పాల్గొనడం మొదలయిన కారణాలవల్ల వారి చదువు కౌతవరం, గుడివాడ, గుంటూరు, కాకినాడ, మచిలీపట్నంలలో కొనసాగింది. 1934 లో పట్టభద్రులయ్యారు. ఎం.ఎ. చదువుదామని వారికి కోరిక ఉండేది; కాని పత్రికాలోకం అదృష్టవశాత్తు వారు జీవికకోసం పత్రికలకు వ్యాసాలు వ్రాయడం, పనిచేయడం అవసరమైంది. దానితో వారి జీవితగతి మారింది. జస్టిస్ పత్రికలో కొన్నాళ్ళు జీతంలేని అప్రెంటీసుగా పనిచేసి, జనవాణి, ప్రజామిత్ర పత్రికల సంపాదకులుగా ఉండి 1939 లో ఆంధ్రప్రభలోచేరి 1942 నుండి 1959 వరకు సంపాదకులుగా సేవచేశారు. తర్వాత 1960 నుంచి విజయవాడలో 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక స్థాపక సంపాదకులుగా సేవచేస్తున్నారు.

సంపాదకులుగా ప్రజాభిప్రాయాన్ని రూపుదిద్దడంలో నార్లవారికి నార్లవారే సాటి. వారిశైలి పఠితను భావావిష్టుల్ని ఆలోచనాపరుణ్ని చేసి, కర్తవ్యపరాయణతతప్ప గత్యంతరంలేదనే నిర్ణయానికి తెస్తుంది. ఇది వారి విద్యార్థిదశలోనే వ్రాసిన తొలి

పుస్తకం "స్వదేశసంస్థానాలు"లోనే వ్యక్తమయింది. అది ఆనాడే వెయ్యిప్రతులు అమ్ముడుపోయిందంటే నేటికీ ఆశ్చర్యమే. దానిని ముట్నూరి కృష్ణారావువంటి పెద్దలు కృష్ణాపత్రికలో సంపాదకీయంతో ప్రశంసించడం మరింత ఆశ్చర్యం.

పనిచేయడంలో నార్లవారు బడే "టాస్క్-మాస్టర్." గంటకు కాలం మౌలికంగా నైనా అనువాదమైనా వ్రాయని జర్నలిస్ట్ ఎందుకు ? —అనేది వారిసూత్రం. జగ్గయ్య పేట బుద్ధసంచికకు ఆగ్నేయాసియాతో బౌద్ధమత విస్తరణనుగురించి "నాలుగు కాలాలవ్యాసం "రేపు సిద్ధపరచండి" అని సాయంకాలంచెప్పి వెళ్ళిపోయారు "ఆనాడు నేను పడినబాధ వర్ణనాతీతం. లైబ్రరీలచుట్టూ రాత్రి ప్రదక్షిణంచేసి ఏదో ముక్కు బడి చెల్లించాను. కాని అట్టి అసిధారావ్రతం లేనిదే ఎవరూ ఏమీ సాధించలేరన్నది నిజం. ఈ దృష్టితో "నా సహచరులు చాలమంది గొప్పరచయితలయారు" అది నాకెంతో సంతోషం కలిగిస్తున్నది" అని వారు అన్నప్పుడు నిజం అంటూ కృతజ్ఞత ప్రకటించాను.

ప్రపంచంలో, ఏమూల, ఏ గొప్పసంఘటన జరిగినా, వారి హృదయం స్పందించకతప్పదు. దాని ఫలితం సంపాదకీయ స్వరూపందాల్చకనూ తప్పదు.

నార్లవారు అప్పటినుంచి నేటి రష్యా కొత్తగడ్డ అనే నాటికల సంపుటి, మాటా మంచీ పిచ్చాపాటీ అనే వ్యాసాల సంకలనాలూ నార్లవారిమాట, జగన్నాటకం అనే కావ్యాలు, మావూరు అనే గేయసంపుటి, జాబాలి పంచరత్నం అనే నాటికలు వీరేశ లింగం, వేమనలపై ఆంగ్లపుస్తకాలు, రష్యన్‌కథలు. మరెన్నో వ్యాసాలూ పుస్తక విమర్శలు వ్రాశారు. నాకుమాత్రం వారు పత్రికారచనకు సాహిత్యస్థాయి సంతరించిన మహారచయితలుగా, ఆంగ్లంలో ఉన్న వినోద విజ్ఞానదాయక వ్యాసాలు వరవడిని తెలుగులోకి తెచ్చిన భగీరథులుగా దర్శనమిస్తారు.

వారు 1958 నుంచి రెండుసార్లు రాజ్యసభ సభ్యులుగా ఉన్నప్పుడు, ఆంధ్ర ప్రదేశ్ పత్రికారచయితలసంఘం అధ్యక్షులుగా వున్నప్పుడు సాహిత్య అకాడెమీ సభ్యులుగా ఉన్నప్పుడు, రాజ్యసభ సభ్యులుగా వివిధ సాంస్కృతిక ప్రతినిధివర్గాల సభ్యులుగా విదేశాలలో పర్యటించినప్పుడు, దేశహితం, దేశగౌరవం ఇనుమడింప జేశారు. ఇలాటి వారిని ఆంధ్రవిశ్వవిద్యాలయం 1973 లో 'డాక్టరేట్'తో గౌర వించడం ఆశ్చర్యమేమీకాదు.

నార్లవారు తాము 1908 లో జబ్బల్‌పూర్‌లో పుట్టినప్పటిస్థితిని, బ్రతికిచెడిన సంసారంలో కలిగే ఉత్పాతాలను చెబుతూ, అప్పుడు తమకు తోడ్పడిన దూరపు జ్ఞాతి నార్ల వెంకటరామన్నగారిని, ఆ కష్టసమయంలో తమ కుటుంబం నిలబెట్టి తమ నందరినీ చదివించినతల్లి శ్రీమతి మహాలక్ష్మమ్మగారిని మద్రాసులో తమకు తోడ్పడిన ప్రజాబంధు మొదలయిన పత్రికల సంపాదకులు ఎస్.జి. ఆచార్యగారిని కృతజ్ఞతతో కళ్ళుమూసుకొని స్మరిస్తారు. వారి తల్లిగారి వయస్సు 92 సంవత్సరాలు.

వారు పూర్వం రాత్రిళ్లు పొద్దుపోయే వరకు పనిచేసి ఉదయం ఏడెనిమిది గంటలకు లేచేవారు. "ఇప్పుడూ అట్లాగేనా?" అని అడిగాను. "ఇప్పుడు అలాకాదు. రాత్రి 9 గంటలకే పడుకొని ఉదయం నాలుగుకే లేచి వ్రాసుకుంటున్నాను" అన్నారు.

సిగరెట్ తెగతాగేవారు నార్లవారు.-శృంఖలాధూమవాయి అని మా పత్రికల వారు వారికిచ్చిన బిరుదు. "ఇప్పుడుచూస్తే సిగరెట్టు మానుకొన్నట్టున్నదే!" అన్నాను. "ఔను! కాఫీకూడ మానివేశాను. ప్రకృతి చికిత్స పొందుతున్నాను" అన్నారు. అంతటి బలమైన అలవాటును ఎలామానుకున్నారా, అనుకుంటుండగా, నాకు 1946 లో ప్రకటితమైన 'కదంబం' అనే వ్యాససంపుటంలోని 'అలవాట్లు' అనే వాస్యం జ్ఞాపకం వచ్చింది. "అలవాటయిన పనిలో ఆనందం తక్కువ. అంచేత ఒక్కొక్కప్పుడు అలవాట్లు అతిక్రమించగోరుతాము. కాని, దానికి చాలా మానసిక దార్ఢ్యం కావాలి; సంకల్పం కావాలి.......కాని, వాస్తవికంగా జీవిత మాధుర్యాన్ని అనుభవించగలవాడు అలవాట్లకు అతీతుడైనవాడే." అనే ఆ వ్యాసంలోని కొన్ని వాక్యాలు ఏకరువు పెట్టాను. వారు మందహాసం చేశారు.

వారు పూర్తిగా వ్యావహారిక భాషావాదులు, "నా వాదం మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు సయితం అంగీకరించారు. పత్రికల నిర్వహణకు వ్యవహారభాష ఉచితమని వారు నాకు ఎప్పుడో ఉత్తరం వ్రాశారు. వారు కీర్తిశేషులు కావడానికి ముందు వారినుంచి నాకొక ఉత్తరం వచ్చింది. తమభావం ఏమీ మారలేదంటూ" అని వారు సగర్వంగా చెప్పుకున్నారు.

"తిడుతూ వ్రాసిన ఉత్తరాలను జాగ్రత్తగా ఉంచాను" అంటూ వారు కొన్ని ఉత్తరాలు చూపారు. వాటిలో ఒక మారని చెక్కు వుంది. దానిపై నా చూపు పడిందో లేదో "ఇది సంభావన చెక్కులెండి. పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరిని విన్నారుగ, ఆయన పంపారు. నే నేదో సాహిత్యసేవ చేస్తున్నానని, నూటపదార్లకు" అంటూ ఎత్తి చూపారు. దానిపైన 25-10-1951 తారీఖువుంది.

హైదరాబాద్ నగరంలో బంజారా హిల్స్‌లోని వారి ఇల్లు నాడూ, నేడూ సరస్వతీ భండారం. ఇంటి నిండా పుస్తకాలే. నాటక సాహిత్యం, చరిత్ర, పురావస్తు గ్రంథాలు కోకొల్లలు. కనీసం నాలుగైదులక్షల రూపాయల విలువగల పుస్తకాలైనా వుంటాయి. ఇవి కాక చిన్ననాటినుంచి సేకరించిన కళాఖండాలను ఐదారు గదులలో అలంకరించారు. "ఇది శివరూమ్, ఇది బుద్ధరూమ్, ఇది కృష్ణరూమ్, ఇది రాజస్థాన్ రూమ్" అంటూ ఆయా శిల్పాలు అలంకరించిన గదులు చూపుతారు. వివిధ దేశాల వస్తువులు అమర్చిన హాలును చూచి నేను "దీనికి అంతర్జాతీయ రూమ్" అని పేరు పెట్టండి అన్నాను. వారి గ్రంథాలయం చూచిన మీదట వారి వ్యాసం "స్వంతపుస్తకం" లోని కొన్నిమాటలు అప్రయత్నంగా నా నోటినుంచి వచ్చాయి. పుస్తకాలు కొనడమంటే నాకు చెడ్డసరదా. జేబులో డబ్బున్నా లేకపోయినా మంచి పుస్తకాన్ని చూడగానే బేరం చేస్తాను. ఆ పుస్తకంతో నాకు అవసరం వుండవచ్చు లేకపోవచ్చు. ఒకసారి

చదివిన తర్వాత మరి దానితో పనిలేకపోవచ్చు. అయినా దాన్ని కొనేదాకా మనస్సు రెపరెపలాడుతుంది. అప్పుచేసికూడ పుస్తకాన్ని కొనడం అనేకసార్లు సంభవిస్తూ వుంటుంది. — పుస్తకాన్ని ఎరువివ్వక తప్పదు. అది పోవడమూ తప్పదు. అలాగని అసలు వాటిని కొనడమే మానలేము. ఇతరుల సంగతి తెలియదుగాని, నా విషయంలో ఇంతే. ఇప్పటికీ, ఎప్పటికీ"

నార్లవారికి ముగ్గురు కుమారులు, ఐదుగురు కుమార్తెలు. మొదటి కుమారుడు పిహెచ్. డి. తక్కిన వారంతా డాక్టర్లు. నార్లవారి గొప్ప అదృష్టం వారి సహధర్మచారిణి శ్రీమతి సులోచనాదేవిగారని నా సంపూర్ణ విశ్వాసం. ఆ గొప్పఇల్లాలు వారిని కంటికి రెప్పవలె అనపాయినిగా కాపాడుతూ, ఇంటిని నిర్వహించడంవల్లే వారికిఅభ్యుదయ పరంపర కలిగిందని నా నమ్మకం. మూడు దశాబ్దాలకు పైగా ఆమెను దర్శిస్తున్న నాకు, ఒకమారైనా విసుగు, చీదర ఆమెలో కనిపించలేదు. "నాకు డాక్టరేట్ ఇచ్చారు. మా ఆవిడకు డాక్టరేట్ ఎవ్వరూ ఇవ్వడంలేదు" అన్నారు నార్లవారు ఛలోక్తిగా. ఇంతకన్నా ఏమి డాక్టరేట్ కావాలి. ఆమెకు- భర్త డాక్టర్; పిల్లలంతా డాక్టర్లు అనిపించింది నాకు.

"మొన్నటి 1974 డిసెంబరు 1 వ తేదీకి మీకు 66 నిండినవి. మీరు మీ సులోచనాదేవిగారూ ఆరోగ్యభాగ్యాలతో వేదోక్తమయిన ఆయుస్సుతో ప్రజాహితం కోసం పాటు పడుతూ వుండాలి" అంటూ సెలవు పుచ్చుకున్నాను. వారి గదులలోని శిల్పాలు తథాస్తు అని తలలు పంకించినట్టు నాకు అనిపించింది.






# శ్రీ నిడుదవోలు వేంకటరావు

"అంకెల బారులంబడి య
హర్నిశ మిట్టటు గొట్టుకొంచు నే
వంకను బుద్ధి కిన్నెడ ర
వంతయులేకను సాహితీ రసం
బింకగనున్న వేళ నను
నెంతయు బ్రీతి దెలుంగువారి ది
వ్యాంకము నందు నిల్పిన మ
హాప్రభు నెన్నెద సూర్యరాక్విభున్"

అని ఆనందబాష్పాలు కురిపిస్తారు "పరిశోధన పరమేశ్వరులు" శ్రీనిడుదవోలు వేంకటరావుగారు. ఔను! నిడుదవోలువారు బెర్నార్డ్‌షావలె బ్యాంకిగుమాస్తాగా జీవితం ప్రారం

భించారు. ఆ అంకెల గారడీని ఆకళించుకున్నారు. కాని, ఉక్కు కటకటాల వెనుక ఉక్కు తెరలమధ్య బ్యాంకిలో (ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో) పని వారికి నచ్చలేదు. విసిగిపోయారు. అంకెల లంకెలతో సహజంగా సాహిత్య పిపాసగలవారు, విసిగిపోక మరేమవుతారు? ఆ విసుగు వారే అప్పుడు చెప్పిన

"చనియెన్ ద్వాదశ హాయనంబులపయిన్
షణ్మాసకాలంబు బ్యాం
కునకే దేహపుటస్థి చర్మములు రెం
డున్ ధారగాబోసి జీ
వనమున్ బుచ్చితి సేవజేసితి మనో
వాక్కాయ కర్మంబులన్
వినియోగించితి నాదు ధీపటిమ వ
న్నెందెచ్చు నెద్దానిలోన్!"

అనే పద్యంలో స్పష్టమవుతుంది. ఆలాటి పరిస్థితిలో తమను సాహిత్య మార్గంలో పెట్టిన పెద్దమనిషిని ప్రశంసించడం సహజం.

నిజానికి నిడుదవోలువారి సాహిత్యజీవితం విద్యార్థి దశనుంచే ప్రారంభమయింది. 1918 లోనే వారు పరవస్తు రంగాచార్యుల మీద, 1919 లో గాంధీజీ 50 వ జన్మదినోత్సవం సందర్భంగా గాంధీజీ మీద పద్యాలు చెప్పడంతోనే దీనితో తెలుగులో పద్యాలలో సాహిత్యానికి నాందికూడ వీరే పలికారు. ఈ పద్యాలు విజయనగరం నుంచి వెలువడే 'భారతమాత' అనే వారపత్రికలో ప్రచురిత మయాయి. నిడుదవోలు వారు సహాయనిరాకరణోద్యమంలో విద్యార్థిగా వున్నప్పుడే పాల్గొని "విద్యార్థివీరుడు" అనే ఖ్యాతి పొందారు.

"గాంధీజీ 1924 లో విజయనగరం వచ్చారు. హిందీలో గాంధీజీతో సంభాషించేవారు ఎవరైనా ఉన్నారా?-అని ఎవరో ప్రశ్నించారు. మా నాన్నగారు హిందీ వచ్చినవారు. ఆ సంగతి నాకు తెలీదు. వారువచ్చి గాంధీజీ భాషణాన్ని తెలుగులోకి అనువదించారు. "చర్ఖాపంచకం" అనే పద్యాలు చెప్పారు. నేను గాంధిజీని కనులారా దర్శించాను" అని నిడుదవోలువారు సంతృప్తితో అన్నారు.

నిడుదవోలువారు 1903 లో విజయనగరంలో జన్మించారు. విజయనగరం పండితప్రకాండుల పుట్టినిల్లుగనుక చిన్ననాటినుండే సారస్వత సమీరాలు వారిపై వీచాయి. విద్యార్థిదశ సి.బి మిషన్ హైస్కూలులోను, ఎ.వి ఎన్. కళాశాల మహారాజ కళాశాలలోను గడిచింది. 1926లో పట్టభద్రులై ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో గుమాస్తాగా చేరారు అప్పూ సప్పూ చేయక గడవని సంసారం. బ్యాంకి ఉద్యోగం నిత్యకృత్యాలకుకూడ నియమబద్ధమైన కాలపరిమితి, తండ్రి శ్రీ సుందరంపంతులుగారి తాళదళ సంపుట ప్రకర కాంతారం"లో నిర్నిద్ర పరిశ్రమ-పీటివల్ల వీరిధారణ రాటుదేరి,

ఏకసంథలోనే విషయాలు మెదడులోని అరలలోచేరి, అవసరమైనప్పుడు గూళ్ళ నుండి గునగునమంటూ వచ్చే పావురాళ్ళవలె అసలసలనే ఊతపదంతో వెలికి వస్తూంటాయి.

1923, 1924 లలో జరిగిన సంఘటనలు విద్వత్కవిలోకానికి నిడుదవోలు వారిని సన్నిహితం చేశాయి. 1923 లో తణుకులో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అధ్యక్షతన జరిగిన విద్వత్సభలో "రాణికి పాదముల పట్టు రాణ విధించెన్" అనే సమస్యను ఈయన—

"ప్రాణికి నాయువు పట్టును
వాణికి రసనమ్ము పట్టు, వరకంకణ సు
శ్రేణికి కై పట్టును, పా
రాణికి పాదములుపట్టు రాణ విధించెన్"

అని పూరించారు. 1924 లో మద్రాసులో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సు తృతీయ వార్షిక సమావేశంలో 'నన్నెచోడుని కాలము' అనే పరిశోధన వ్యాసాన్ని ఆంగ్లంలో చదివారు. ఈ రెండు సంఘటనలతో నిడుదవోలువారిపై విద్వత్కవుల, పరిశోధకుల దృష్టి పడింది. కాని, ఈయన పండితులను ఆశ్చర్యచకితులనుచేసింది 1934 లో వీర శైవశాస్త్ర గ్రంథమైన 'వీరశైవ అష్టావరణ ప్రమాష్టకాభరణము' అనేదానిని,1935లో 'త్రిపురాంబకోదాహరణము'ను సవిమర్శకంగా ప్రచురించడం. ఈ రెండిటితో నిడుద వోలువారు కొమ్ములు తిరిగిన అప్పటి పరిశోధకుల సరసన పీట వేసుకొన్నారు. కాని బ్యాంకు బంధాలు ఇంకా వదలలేదు. అప్పటికి అవి తొలగడమూ విచిత్రంగానే జరిగింది.

నిడుదవోలువారికి విజయనగరం నుంచీ కాకినాడలోని ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖకు తబాదలా అయింది. 1936 లో పిఠాపురం రాజా సూర్యారావు బహద్దరుగారు తమ ఆస్థాన విద్వత్కవులైన ఓలేటి వేంకటరామశాస్త్రిగారి వద్ద నన్నె చోడుని కుమారసంభవం చదువుతున్నారు. దానిలోని వీరశైవాగమ సంప్రదాయాలు తెలుసుకొనడానికి తగిన వీరశైవాగమజ్ఞులు కావలసివచ్చింది. సుప్రసిద్ధ విమర్శకులు నడకుదుటి వీరరాజుగారు "బ్యాంకులో వేంకటరావు వుండగా ఎందుకు మహారాజా ఆలోచన?" అని రాజాగారికి నివేదించారు. బ్యాంకి గుమాస్తాలలో ఇంతటి వారుం టారా అని ఆశ్చర్యపడ్డారు పిఠాపుర ప్రభువులు. వెంటనే నిడుదవోలువారిని పిలి పించారు. అప్పటినుండి పరిచయం పెరిగింది ఇద్దరి మధ్యా. ఇలాటి విద్వాంసుడు బ్యాంకిలో అంకెలసంకెళ్ళలో పడడం సమంజసం కాదనుకున్నారు రాజాగారు. కనుక గుమాస్తాపనికి ఇస్తీఫా ఇప్పించి తమ కళాశాలలో ట్యూటరుగా నియమించారు. ఇది జరిగింది 1939లో. సంవత్సరంపాటు అక్కడ పనిచేసి, రాజాగారి సూర్యరాయాంధ్ర నిఘంటు' కార్యాలయంలో పదసంగ్రాహకులుగా చేరారు నిడుదవోలు వారు.

ఈయనకు ఇప్పటికి సరైన పనిదొరికింది. ఈయన ధారణశక్తికి నిఘంటు ప్రధాన సంపాదకులైన శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, శ్రీ వెంపరాల సూర్య నారాయిణశాస్త్రిగారు మొదలైనవారు ఆశ్చర్య పడేవారు. కాని నిడుదవోలువారి దృష్టికి పడిన ప్రతిపదానికి ప్రయోగం వెంటనే స్ఫురించవలసిందే. 'నేను చదివాను అన్నట్లుకాక ఈయనకు కంటబడ్డ ప్రతి విషయమూ ఒంటబట్టి పోవలసిందే. ఆ యా గ్రంథాల ముద్రణాది వివరాలతోసహా ఏ విషయమైనా అడిగిందే తడవుగా చెప్పడంలో ఈయనకు ఈయనే సాటి. తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుందన్న సామెత ఈయన యెడల సార్థకం. ఒక్క పదం ప్రస్తావించండి, నన్నయ మొదలు నేటిదాక అన్ని గ్రంథాలలోని ఆ పదప్రయోగసరళి నిర్ఝరపాతంగా మనపై దూకవలసిందే. ఝంఝూ మారుతంగా మనమీద వీచవలసిందే. అందుకనే ఎవరో ఈయనను "ప్రయోగమూషిక మార్జాల" అని అన్నారు. ఈయన తెలుగు సాహిత్యంలో చదివి మరచిందిలేదు; ఒడలు మరచి చదవందిలేదు. తెలుగుభాషలో ఏ మూల ఏమున్నదో చూపగల జగదివిటీ నిడుదవోలువారు. కనుక త్వరలో సూర్యారాయాంధ్ర నిఘంటువులో అసమగ్రమైన మూడవసంపుటి సమాప్తి కావడానికి, నాలుగవ సంపుటం సిద్ధం కావడానికి కృషిచేశారు. ఈ పని చేస్తూ, 1941 లో మద్రాసు విశ్వవిద్యాలయం ఎం. ఎ. లో సర్వప్రథములై సువర్ణపతకం పొందారు. పిదప ఒక యేడు పి. ఆర్ కాలేజీలో పనిచేసి, 1944 లో మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో సహాయోపన్యాసకులుగ చేరి 1949 నుంచి తెలుగు శాఖాధ్యక్షులై 1964 లో షష్టివర్షాలు పూర్తి కావడంవల్ల పదవినుంచి విరమించారు. అనంతరం హైదరాబాద్‌కు తరలివచ్చి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో యూనివర్శిటీ గ్రాంట్సు కమీషన్ ప్రొఫెసరుగా నాలుగేళ్లు పనిచేశారు.

ఈయన ప్రతిభ, పరిశోధన, రచనా వ్యాసంగం 1944 నుండి 1974 వరకు అవిచ్ఛిన్నంగా ముప్పయి సంవత్సరాలపాటు బహుముఖంగా ప్రవహించాయి. విశ్వవిద్యాలయాలలో అధ్యాపన పరిశోధనలు, వావిళ్ల సంస్థవారితో ప్రాచీన కావ్యాలను పీఠికలతో శాస్త్రీయ సంస్కరణలతో ప్రకటింపజేయుడం ఆంధ్ర పత్రిక, భారతి పరిశోధన అన్నల్స్ ఆఫ్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ మొదలయిన పత్రికలలో పరిశోధన వ్యాసాలు వ్రాయడం, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకాలయం, తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయాల ప్రచురణ సంఘ సభ్యులుగా అముద్రిత అపూర్వ గ్రంథాలను బృహత్పీఠికలతో ప్రచురింపజేయడం- ఇలా నాలుగుపాయలై ప్రవహించెను. ఆయన ప్రజ్ఞాప్రవాహిని. ఈ వాహినిలో అనర్ఘరత్నాలు కొట్టుకొని వచ్చి ఆంధ్రావళికి అందాయి. ఈ విధంగా అందినవే తెలుగు కవుల చరిత్ర, ఆంధ్ర వచన వాఙ్మయం, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయం మొదలైన మౌలికరచనలు. త్రిపురాంతకోదాహరణం, ఆంధ్రప్రహసన వాఙ్మయం తెలుగుభాషా సమితి (మద్రాసు) బహుమతిని, కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము, విజయనగర సంస్థానము-సాహిత్య పోషణ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ బహుమతిని పొందాయి. ప్రాచీన గ్రంథ

పరిష్కరణలో మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్లకు దీటైన నిడుద వోలువారు విపుల పీఠికలతో ప్రచురించిన ప్రాచీన ప్రబంధాలు, శాస్త్రగ్రంథాలు కోకొల్లలు ఖడ్గలక్షణ శిరోమణి, కట్టావరదరాజు రామాయణము మొదలైనవి 56 వుంటాయి పెక్కు నవీనరచనలకు పీఠికలు వ్రాశారు. ఆంధ్రాంగ్ల భాషలలో శతాధిక వ్యాసాలు, శతాధిక ఆకాశవాణి ప్రసంగాలు, ఇంక సదస్సులలో, గోష్ఠులలో ప్రసంగాలు ఇన్నీ అన్నీ కావు.

అన్నీ ఒక ఎత్తు అగస్త్యుడు ఒక ఎత్తు అన్నట్లుగా ఈయన రచనలన్నీ ఒక ఎత్తు, ఉదాహరణ వాఙ్మయచరిత్ర ఒక ఎత్తు. రెండు శతాబ్దాలుగా మరుగుపడిన ఉదాహరణ వాఙ్మయశాఖను ఈయన పునరుద్ధరించి ఈనాడు విశ్వనాథ సత్యనారాయణ మొదలైన మహాకవులు ఈ శాఖను చేపట్టే విధంగా ఉదాహరణ వాఙ్మయచరిత్ర మూలంగా దీనిని ప్రవర్తింప జేశారు నాటినుంచి ఈనాటి వరకు 35 గురు కవులు ఈ ప్రక్రియను చేపట్టి ఈయనను "ఉదాహరణ వాఙ్మయోద్ధారక" అని కీర్తించారు.

కృష్ణమాచార్యులవారి సంస్కృత సాహిత్య చరిత్రలో ఆంధ్రదేశ సంస్కృత కవి పండితులను గూర్చిన విషయాలన్నీ వ్రాసి సాహాయ్యంచేశారు. ఇదివరకు సంస్కృత వాఙ్మయచరిత్రకారులకు తెలియని మయూరకృత సూర్యదండకం, శివ స్తవం మొదలయినవానిని వెలుగులోకి తెచ్చారు. నన్నయ నుంచి నేటివరకుగల అపూర్వ విషయాలను 35 సంపుటాలలో సేకరించి పెట్టారు. అవన్నీ ముద్రణకు ఎదురు చూస్తున్నాయి. సాహిత్యమే నిత్యకర్మానుష్ఠానంగా జీవితం సాగిస్తున్నాడు గనుకనే "పరిశోధన పరమేశ్వర", "జంగమ విజ్ఞాన సర్వస్వం", "ఏక సంథాగ్రాహి" అని బిరుదాలు పొందారు. వీటన్నిటికీ మాకుటాయమానంగా ఆంధ్ర విశ్వ విద్యాలయం ఈయనను 1973లో "కళాప్రపూర్ణ" బిరుదంతో సత్కరించడం.

"ప్రథిత వేదము వేంకటరాయశాస్త్రి
పొందగా బుట్టిన కళాప్రపూర్ణ బిరుదు
సార్థకంబయ్యె సాహిత్య జగతి నేడు
నిడుదవోల్వేంకటరాణ్మనీషివలన"

అని ఆ సమయంలో కవులు కైవారంచేశారు.

ఈ పరిశోధన పరమేశ్వరునిచూపు సజ్జనసాహిత్యం మీదనూ పడింది. అచ్చ తెలుగులో ఆరితేరినవారు గనుక, విద్యార్థిదశనుంచే కైత చెప్పగలవారు గనుక

"నుడులబెడంగును నడకల
యొదికము వడివడితనంబు నుడివోవని కూ
ర్పడరించు చదువు చదరును
గడివోవని తలపు"

గల తెలుగుకబ్బము "మించుపల్లె", "తెలుగుపొలుపు"లను ఆంధ్ర నలందా శతకము, శ్రీ రామగీతామృతము, శ్రీ రామలింగేశ్వర శతకము, గాంధీ సాహిత్యము మున్నగు కృతులు చెప్పారు. చాటు పద్యాలు వందలు.

నిడుదవోలువారికి వైయక్తికంగాను, సాహిత్యదృష్టితోను మంచి అలవాట్లు న్నాయి. తాము చూచినవీ, తమకు తోచినవీ చిన్న నోటుబుక్కులో ఎప్పటికప్పుడు గుర్తుపెట్టుకోవడం అలవాటు. అలా గుర్తువేసుకొన్నవాటిలో సూక్తులు చాలవున్నాయి. "ఆంధ్రులకు ఐకమత్యం యతిలోనేగాని, మతిలో లేదు; బలి దానంవల్ల అడుగున పడి పోతే పొట్టి శ్రీరాములు బలిదానంవల్ల పొడుగైనాడు: మన విద్యావిధానం "కా" గుణింతంతో ప్రారంభమై కాన్వకేషనుతో ముగుస్తుంది; మనకిప్పుడు రెండే పనులు - మర పని, మరుపని; దేశభాషలందు తెలుగులెస్స అన్నది ప్రాతమాట, ఇలగలుగు భాష లందెల్ల తెలుగు లెస్స అన్నది నేటిమాట. ఇలాటివి ఎన్నోసూక్తులు.

ఈయన తెల్లవారుజామునే లేస్తారు. దంతధావనాదికలు ముగించి, మూరెడు పొడుగు కంచుగ్లాసుతో కాఫీసేవించి, గ్రంథపర్యాలోకనం ప్రారంభిస్తారు. షడ్రసోపేత మైన భోజనం, భోజనానంతరం ముంతమామిడి పప్పో, కిస్మిస్సో, ఖర్జూరాలో నమిలి తాంబూలం వేసుకొని కొంచెంసేపు ఉయ్యాలలో ఊగి, కోటూ, ఉత్తరీయం వేసుకొని గొడుగు పట్టుకొని విశ్వవిద్యాలయానికి బయలుదేరే వారు. ఉద్యోగసమయంలో. ప్రస్తుతం భోజనానంతరం కొంత విశ్రాంతి, తర్వాత సారస్వతసేవ, శబ్దార్థ పునరాలోచనం, వ్రాతమొదలైనవి.

ఈయనకు ఐదుగురు కుమార్లు, ఇద్దరు కూతుళ్లు. జ్యేష్ఠకుమారుడు శివసుంద రేశ్వరరావు తండ్రికి దీటైనవాడు. 'పుత్రా రిచ్ఛే త్పరాజయం' నానుడిని సార్థకం చేస్తాడు. మనుమరాండ్రలో జయసుధ తమిళ చలనచిత్రరంగంలో తారాస్థాయి నందుకొంది.

"ప్రతి పదానికీ ప్రయోగంచూపి, ప్రామాణికమైన గొప్ప నిఘంటువును అదిన్నీ అనుకూల సాహాయ్యసంపత్తి లభించినప్పుడు ఒకే సంపుటంలో పదిహేను వందలో లేక రెండువేల పుటలలో రచించి, ఆంధ్ర మహాజనులకు అందజేయాలనివుంది అందజేయగలననే విశ్వాసమూవుంది" అని పదేళ్ళక్రితం నేను కలుసుకున్నప్పుడు అన్నారు. తర్వాత శబ్దరత్నాకరాన్ని అనుబంధంతో ప్రచురించారు, క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీవారికోసం. ఇప్పుడు దానిని సంస్కరించి 35 వేల పదాలతో తమ ప్రతిజ్ఞమేరకు సిద్ధపరచారు. ఇదిగాక ఆంధ్రవాఙ్మయచరిత్ర ఆరు సంపుటాలు సిద్ధంగా వున్నాయి. ఆంధ్రాంగ్లాలలో కొమర్రాజువారి జీవితచరిత్ర మొదలయినవి అచ్చుకు సిద్ధంగా ఉన్నాయి. వాటిని ఆంధ్రావళి అచ్చువేయించి వాడుకోడం అవసరం

